# ఇందులో కథలు

# నేర్పు

## రచన : థామస్ బీర్

[థామస్ బీర్(1889–1940) కొన్ని పుస్తకములు మాత్రమే రచించినప్పటికి, అతడు రచయితగా పేరుప్రఖ్యాతులు గడించాడు. ఐవాలో జన్మించాడు. ఏల్ మరియు కొలంబియా విశ్వవిద్యాలయ ములలో విద్య నభ్యసించాడు. న్యాయశాస్త్రంలో డిగ్రీ సంపాదించిన తరువాత తన తండ్రిగారి 'లా' ఆఫీసులో పనిచేశాడు. మొదటి ప్రపంచయుద్ధానంతరం పరఫిరంగుల సేనలో ప్రథమ లెఫ్టినెంట్‌గా పనిచేసిన తదుపరి గంభీరంగాను, జయప్రదంగాను రచనలుసాగించి, న్యాయవాదవృత్తిని వదులుకున్నాడు.

అతడు నవలలు, విమర్శనలు రచించినను, చాలామటుకు కాలమంతా ప్రముఖ పత్రికలకు కథలు వ్రాయుటయందే వినియోగించాడు.

Mrs. Egg and other Barbarians అనే కథలనుండి యీ 'నేర్పు' కథ గ్రహింపబడినది.]

'వీరాంతా నాకు విసుగుపుట్టిస్తున్నారు?' అని కసిరింది మిసెస్సు యగ్. ఆమె ముగ్గురుకొడుకులు, 'ఎందుకమ్మా!' అంటూ సణిగారు. సీమరేగి చెట్టునీడ వరండాకు బాగా వున్నది. ఒక ఉడుత ఆ చెట్టుమీద పరుగెత్తింది. మిసెస్సు యగ్ పిండి రొట్టె తిన్నది. ఒక గ్లాసు ఐస్ టీ త్రాగినది. ఆమె చేతివ్రేళ్ళకు వుంగరా లున్నవి. చేతులు బల్లమీదపెట్టి

'అమ్మాయిలూ, మీరు నాకు విసుగుపుట్టిస్తున్నారు. నౌకా దళంనుంచి డామీ యింటికొచ్చి సరిగా ఏడువారాల రెండు రోజుల ఒక గంటకూడా కాలేదు. వాడ్నిగురించి అమర్యాదగాను, అనుచితంగాను నాకు చెబుతున్నారు. యడిత్ సిమ్స్‌ను వివాహం చేసుకోవా లనుకుంటున్నాడు. అజాను బాహుడు. ఆరడుగుల నాల్గున్నర అంగుళముల పొడవుంటాడు. అట్లాంటిక్ యుద్ధనౌకాదళంలో బరువు ఎత్తుటలో చాంపియన్ బిరుదు సంపాదించాడు. అట్టివాడ్నిగూర్చి మీరంతా గగుర్పాటు చెందుతా రెందుకో నాకు తెలియుటలేదు. నౌకాదళంలో నాల్గుసంవత్సరాలు పనిచేసి, జపానుకు వెళ్ళివచ్చినవాడు సహజంగా యింతకుముందే ప్రణయకలాపంలో వుంటాడు...!' అన్నది మిసెస్సు యగ్.

'అమ్మా!' అన్నారు కూతుళ్ళు.

మిసెస్సు యగ్ పంచదారఅద్దిన మరొక రొట్టెతిన్నది. 'ఆ పదహారు సంవత్సరాల అమ్మాయి క్యూబా నివాసికన్నా మెరుగుగా వంటచేయలేదని చెబుతాడు. క్యూబానుంచి మార్చి నెలలో జామపండ్ల మురబ్బా పంపించాడు. అమోఘంగా ఉంది. ఈ సంసారంలో ఆడమ్ జాన్ యగ్ చాలా అందమైనవాడని మీకు తెలుసు. ఓహియో రాష్ట్రంలో మీ ముగ్గురు భావగర్భితమైన వాళ్ళు. మీ భర్తలు ఎలా సంభాళించు కుంటున్నారో నాకు తెలియదు. యడిట్‌సిమ్స్‌ను వెండాటమంటారా?' ఆయాసపడుతూ టీ జారువంక చూచింది. వంటయింటివైపుచూస్తూ, 'బెన్‌జామినా' అంటూ పెద్దగా పిల్చింది. 'యింకొంచెం ఐస్ టీ యిస్తే బాగుంటుంది— డామీ

ఎట్టినిపండ్లు తొందరగానే తెస్తాడు. వాడికి సాధారణంగా నాలుగుగంటలకు దాహం అవుతుంది.' అన్నది యగ్.

కొత్తగా వచ్చిన వంటమనిషి వరండానుంచి వచ్చినది. ఆ వంటమనిషి ఎట్టినిజుట్టు చూస్తూ మిసెస్సు యగ్ కుమార్తెలు విశ్రాంతి చేయుచున్నారు. వాళ్ళకన్నా ఎత్తుగా వున్నది. ఖాళీ చేయబడిన టీ జారును తీసికొని బెన్‌జామినా మౌనంగా వెళ్ళింది. ఆమె వెళ్ళినతరువాత పెద్దకూతురు 'అమ్మా, చూడు, యీమె డామీ అంత ఎత్తుగావున్నదే' అంటూ గుసగుసగా చెప్పింది. 'ఆరడుగుల ఎత్తు వుంటుంది. అయితే అందంగా వుంటుంది. అట్టి అమ్మాయిని దుమ్ము దులపమని. టేబిల్ శుభ్రపర్చమని చెప్పటం కలవరంగానే వుంటుంది. ఆమె క్లీవ్‌లాండ్ హైస్కూలులో చదువుకున్నది. ఫ్రెంచి భాష తెలుసు. ఆమె మనయింటిలో వుండటం హాయిగా వున్నది.' అన్నది యగ్.

'అమ్మా, అది సరేగాని అందంగా వుంటుందని అను కోను. ఈ అమ్మాయి తమ్ముడ్ని కారులో తీసుకొనివెళ్ళి యడిట్‌సిమ్స్‌కు, స్నేహితులకు డామీ పరిచయం చేయటం సబబుగా లేదు' అన్నది రెండోకూతురు.

'అది చాలా తెలివైనపని అనుకుంటాను. హామీషు చురుకైనవాడు. వారంరోజులలో పాలుతీయటం నేర్చుకున్నాడు. డామీ అంటే ఎంతో అభిమానం' అన్నది మిసెస్సు యగ్.

పళ్ళెంలోవున్న పంచదార రొట్టెను ముక్కలుగా చేసింది. 'బెన్‌జామినా! టీ సిద్ధంకాగానే, స్వీట్సు, కేకులు తీసికునిరా. డామీకి యిష్టం' అన్నది యంగ్.

'అలాగేనండి' అన్నది బెంజామినా.

'అమ్మా, డామీ మంచివాడని నీవుచెప్పటం బాగానే వున్నది. అయితే పట్టణం సిమ్‌సెన్ వంశీయులు గౌరవముగల పెద్ద భాగ్యవంతులు. నాగరికత తెలిసినవారు. అట్టివారిదగ్గరకు వెళ్ళేటప్పుడు, డామీ నీటుగా దుస్తులు ధరించి వెళ్ళాలి. లేనియడల మనకు నామోషీగా వుంటుంది.' అన్నది ఆఖరి కూతురు.

'అమ్మాయీ నీవు చెప్పేమాటలు ఉత్సాహంగా లేవు. డామీ దుస్తులన్నీ సరళంగా, మృదువుగా వుంటాయి. నావికాదళంలో నాల్గుసంవత్సరాలు పనిచేసినవాడు. రోజుకు రెండు మారులు 127 ఆవులకు పాలు పితికేవాడు. వాడు యంత్రాంగపు సామానులలో పనిచేసేవాడు. అందులో వాడికి తెలిసిన పిల్లను చూచుటకు అనువగు దుస్తులు ధరించి వెళ్ళాలని ఎవ్వరూ చెప్పరు. వాడివయస్సు 21 సం॥ల 9 వారాలు. వాడి విషయాలు వాడు చూసుకోగలడు.' అన్నది యంగ్. ఈలోగా బెన్‌జామినా స్వీట్లు, రొట్టెలు, మొదలగునవి తెచ్చి బల్లమీద అమర్చినది. 'యింత ఎండ రోజునకూడా నిన్ను కష్టపెట్టటం నాకు బాధగానే వున్నది' అన్నది యంగ్.

ఈ మాటలకు బెన్‌జామినా చిరునవ్వు నవ్వుతూ వెళ్ళిపోయింది. మిస్సెస్సు యంగ్, ఒక కేకు తింటూ ఆనందించినది. 'అమ్మాయిలూ, మీరంతా ఉల్లాసంగా ఉన్నట్లూ, డామీ

లేనట్లుగా చెబుతారు. వాడు క్లీవులాండ్ వెళ్ళి పనివారల కోసం వాకబు చేశాడు. బెన్‌జామినాతో స్వయంగా మాట్లాడాడు. ఆమె తయారుచేసిన వంటపదార్థాలు తిన్నాడు. ఆమె పనికి తృప్తిపడ్డాక, ఆమెను, హామిూష్‌ను కారులో తెచ్చాడు. ఇప్పుడామె హాయిగాను, విశ్రాంతిగాను వున్నది' అన్నది యంగ్.

ఆమె ముగ్గురుకూతుళ్ళూ నిట్టూర్పు విడిచారు. 'ఈ సాయంత్రం ఎంత ఆనందంగా వున్నది.' అన్నది యంగ్. 'అమ్మా, డామిూ అశ్రద్ధగావుంటాడు. మాట స్థిరంలేదు. క్రిస్మసున్నులో యింటికి వచ్చినప్పుడు యడిత్ సిమ్స్‌కు బహుమతిగా వుంగరంకూడా తీసికొని రాలేదు. వివాహం చేసుకుంటే వాడు యిలాగేనాచేయవలసింది?' అన్నది పెద్దకూతురు.

మిసెస్సు యంగ్ ఓపిక పట్టలేకపోయినది. 'బ్రూక్‌లిన్‌కు వెళ్ళేముందు, జడ్జి రాన్‌డోల్ఫ్ పార్టీతో వున్నాడు. మిూరంతా యడిత్ సిమ్స్‌వలె ప్రవర్తిస్తారు. ఆమె, ఆమె స్నేహితులు అందమైనవాళ్ళు, మంచివాళ్ళు.' అన్నది యంగ్.

ఒక గుడ్డ సంచినిండా పళ్ళుపోసుకుని, కుడి భుజంమిూద పెట్టుకొని ఆడమ్ వరండాలోనికి వచ్చాడు. వాళ్ళవంక చూస్తూ ఆ పళ్ళసంచిని క్రింద పెట్టాడు. సిగరెట్టు వెలిగించి ముక్కు రంధ్రాలగుండా పొగ వదిలాడు. పెద్దగా మాట్లాడటం లేదు. మిసెస్సు యంగ్ ఒకగ్లాసు ఐస్ టీ యిచ్చినది. ఆలోచిస్తూ ఆడం త్రాగటం ప్రారంభించాడు. అక్కలంతా ఎగతాళి జేశారు. తల్లి వాళ్ళను మందలించింది. ఏదైనా ఆడమ్‌ను వాళ్లు ప్రేమిస్తారు. ఆడమ్ ముక్కు చిన్నదిగా వుం

టుంది. ముక్కు చిన్నదిగా వున్నట్లయితే వానికి వంకబెట్టుటకు వీలులేదు. రొట్టెలు తీసుకొనుటకు అతడు వంగితే వాని నల్లని బుజాలు అరలవలె త్రొణికిసలాడును. మాసిపోయిన బనీను వాని వక్షస్థలాన్ని దాచిపెట్టుతుంది. వాని కానవాసు ట్రౌజర్సు మొలక్రింద వ్రాగులాడుతూ వుండును. యడిత్ సిమ్స్ దగ్గరకు వెళ్ళేటప్పుడు యీ దుస్తులు మార్చుకుంటాడని మిస్సెస్ యగ్ రహస్యంగా అనుకునేది. కప్పులలో కేకులు వాని కండలుతీరిన శరీరంలోనికి వెళ్ళినవి. అవి పూర్తికాగానే ఆదమ్ మరొక సిగరెట్టును వెలిగించాడు. చలనంలేని వాని పెద్ద నేత్రాలముందు ఆ సిగరెట్టుపొగ అలలవలె ఆడుకుంటున్నది. రేగిచెట్ల గుండా రోడ్డువంక చూచాడు. గ్యారేజిపక్కగా తిరుగుతున్న హామీమ్‌ను చూచి చప్పట్లు కొట్టాడు. హామీమ్‌కూడా సమాధానం చెప్పాడు. 'ఏమిటి హామీమ్‌కు చెబుతున్నాడు?' అని అడిగింది మిసెస్ యగ్.

'మెయిల్' అంటూ ఆదమ్ క్రింద కూర్చున్నాడు. 'టీ' జాడివంక నిర్వేరగా చూచాడు. మిసెస్సు యగ్ ఒక గ్లాసు 'టీ' యిచ్చింది. ఆ వల్చనిగ్లాసు తీసికొనేటప్పటికి వానికి ఎక్కడాలేని ఉత్సాహం, ఉద్రేకం వచ్చినవి. కండరాలన్నీ అండాకృతిగా తిరిగినవి. ఎండిపోయిన కంఠం కదలుబారింది. పాదాలకు చురుకుదనం వచ్చింది. మిసెస్సు యగ్ సంతోష పడ్డది. బెన్‌జామినా 'టీ' చక్కగా తయారుచేసింది. 'టీ' బాగా చేసినందుకు ఆదమ్ మెచ్చుకున్నాడనే సంగతి ఆపిల్లకు మిసెస్సు యగ్ నేర్పుగా చెప్పాలి. 'నీకో పొట్లం తెచ్చాను.' అంటూ యువకుడు హామీమ్ మెట్లు ఎక్కుతున్నాడు. ఆదమ్‌కు

ముద్రపడినట్టి, నలుచదరంగా వున్నట్టి ఒక పెట్టెను యిచ్చాడు. 'నీ బహుమతిగా నేను సంతకం చేశాను.' అంటూ ఉత్తరం చదువుటకు వారిదగ్గరనుంచి చాటుకు వెళ్ళాడు. హామీష్‌కు పదహారు సంవత్సరాలుండును. లావుగా వుంటాడు. మాసిపోయిన గుడ్డలను కట్టుకున్నాడు. ఆదమ్ అంటే ఎంతో ప్రాణంగా వుంటాడు.

తన సన్నని వ్రేళ్ళతో ఆ పెట్టెను ముక్కలు ముక్కలుగా చించాడు. ఒక వెల్‌వెట్ కేసు వున్నది. అందులో రెండు ఉంగరాలు ధగ ధగా మెరుస్తున్నాయి. ఒకటి వజ్రాల వుంగరం. బంగారంతో నగిషీ చెక్కారు. అది శాశ్వతంగా యడిత్ సిమ్స్‌తో కట్టుబడి వుండే లాగున చేసే పెండ్లి ఉంగరమని ఆదమ్ ఊహించాడు. అక్కలంతా సంతోషించారు. 'డామీ, నీకు సొమ్ములందు అంత మక్కువ లేదని ఎవ్వరూ చెప్పలేరనుకుంటాను.' అంటూ మిసెస్సు యగ్ కూతుళ్ళ వంక గర్వంగా చూసింది. కూతుళ్ళంతా లేచారు. ఈ ఆభరణాల సంగతి ఊళ్ళో అందరికీ తెలుస్తుందని ఆమెకు తెలుసు. 'గుడ్, ఈవినింగ్! అమ్మాయిలూ' అన్నది తల్లి. వాళ్ళంతా తల్లిని ప్రేమతో గౌరవించారు. ఆమె ఆనందించినది.

పెద్దకూతురు మోటారు కారు దగ్గరకు వెళ్ళుతున్న సంగతి ఆదమ్ గమనించలేదు. ఉంగరాలవంక తదేకదృష్టితో చూస్తున్నాడు. వాని ముఖంలో అదోక విధమైన మార్పు వచ్చినది. హామీష్‌కూడా వచ్చి ఆ వుంగరాలను వంగి చూస్తున్నాడు. వానికి బూడిదరంగువంటి పెద్దకళ్ళువున్నాయి.

బాతుముక్కు వంటి ముక్కు గలడు. పెద్దవంశీయుడని మిసెస్సు యగ్ అనుకున్నది.

'హామిూష్, నీవు యింకా టీ త్రాగలేదు. డామిూ కొద్దిగా ఉంచాడు. బెన్‌జామినా ఎంత చక్కగా తయారు చేస్తుంది.'

హామిూష్ నెమ్మదిగా టీ త్రాగాడు. 'మోటారు సైకిలు కావాలి' అని అడిగాడు. ఆదమ్ అంగీకార సూచకంగా తల ఊపాడు. వెంటనే గ్యారేజి దగ్గరకు వెళ్ళి ఆదమ్ మోటారు సైకిలు తీసుకొని వరండా మెట్ల దగ్గిరకు వచ్చాడు. భక్తి పూర్వకంగా ఆదమ్ వంక చూశాడు. విడవలేక విడవలేక వెళ్ళాడు. యగ్ డైరీ కంపెని రంగు రంగుల ఆవుల మందతో, వాటి కొమ్ముల ధ్వనితో కోలాహలంగా వుంటుంది. కూలి పనికి వచ్చిన పదిమంది కూలీలు నీటిలో చేతులు పరిశుభ్రం చేసుకుంటున్నారు. మిసెస్సు యగ్, కూతుళ్ళు కలిసి కారులో బయలుదేరారు. మెయిన్‌బజారు గుండా కారు వస్తున్నది. కూతుళ్ళు సిమ్సు యింటివద్ద ఆగి, వుంగరం చేరిందని చెప్పటకు అచ్చట ఆగిపోయారు.

మిసెస్సు యగ్ డామిూని పిల్చింది. 'డామిూ, నీవు యడిత్ వద్దకు వెళ్ళేముందు మురికి గుడ్డలు మార్చుకో. అదొక సాంప్రదాయం' అన్నది.

యిదంతా 'బంక్' అంటూ ఆ ఆజానుబాహుడు తల్లివైపు తిరిగి, 'అమ్మా, నీ చేతులు ఎంతో అందమైనవి.' అన్నాడు. 'డామిూ, చికాగాలో అంత వేడిగా వుండదని

యిదివరలో అనేవారు' అని సంతోషంగా మాటాడింది యగ్.

ఆడమ్ సిగరెట్టు పొగ రింగు రింగులుగా వదుల్తున్నాడు ఆశ్చర్యం కలుగజేస్తూ, 'అమ్మా, పాలిపోయిన చేతులను గూర్చి ఒక స్త్రీ పాట నెవాడాలో పాడుతుంటే విన్నాను.' అన్నాడు. 'ఆపాట నాకు తెలుసు. 1910 లో ప్రెస్బిటీరియన్ డిన్నరులో ఆ పాట పాడారు. కొంతమంది ఆ పాట చర్చి పార్టీలకు పనికిరాదని అనేవారు. అది కొంతకాలం వరకు వాడుకలో వున్నది. బెన్‌జామినాకు తెలుసు. ఆమెను అడుగుతాను.' అంటూ కుర్చీలోనుంచి లేచింది. మిసెస్ యగ్ గడప దాటుకుంటూ వంట యింటిలోనికి వెళ్ళి వంట మనిషిని అడిగింది. 'శృంగార రసకరుణ గల్గిన ఒకపాట వున్నదట. డామీ ఆపాట వినాలని ఆదుర్దాగా వున్నాడు. అది ఒక స్త్రీ పాలిపోయిన హస్తాలనుగురించి ప్రేమను గురించినదట' అన్నది.

బెన్‌జామినా తన సున్నితమైన హస్తాలతో జడను సవరించుకొని గులాబిరంగువంటి ఆమె గోళ్ళవంక చూసుకున్నది..

'పాలిపోయిన చేతులా - అది కాదనుకుంటాను. అది కాశ్మీర్ ప్రణయగీతిక. అది ఎక్కువగా పాడుతూవుండే వాడు' అన్నది. ఆమె జవాబుకు గడపలో నిల్చున్న ఆడమ్ కృతజ్ఞత తెలియబర్చాడు. సొమ్ములపెట్టె జేబులో వేసికొని మెట్లు దిగాడు. వాని విశాలమైన బుజాలు ప్రకాశించినవి. బుట్టలోవున్న పండ్లు తీసుకొని ఒకదానిని ముక్కలుగా చేశాడు. ఒక పండును పరధ్యానంగా తింటూ కాయతోలును

కోడిపెట్టమీదకు విసరివేశాడు. బెన్‌జామినా ముల్లంగి దుంప లను బాగుచేస్తున్నది. మిసెస్సు యగ్ నింపాదిగా అక్కడకు జేరుకున్నది. ముల్లంగి దుంపలంటే మిసెస్సు యగ్‌కు అమిత యిష్టం. రెండు దుంపలను తిన్నది. యడిత్ సిమ్స్ ఆదమ్ వెనుకభాగం చూడకుండా వుంటే బాగుంటుందని అను కుంటున్నది. ఆదమ్ దుస్తులు, బనీను వెనుక భాగమున రకరకాల గుడ్డలు వుంటాయి. పెండ్లి సమయమునందు మర్యాదగా వుండదు. మిసెస్సు యగ్ ఆలోచించినది.

ఆమె ఆశ్చర్యపడినది. ఆదమ్ మరొక పండుతీసికొని చేతితో వత్తాడు. ఆ పండులోనుంచి ఎఱ్ఱని ద్రవం వచ్చి వాని బుజాలమీద, చొక్కాలమీద పడి ఎఱ్ఱగా ప్రకాశిస్తున్నది. అదంతా రుద్దుకున్నాడు. చెవ్వులను తీసివేసి యాపిల్ చెట్టుకు తగిలించాడు. తృప్తిగా సిగరెట్టు పీలుస్తూ పొగ వదులు తున్నాడు. తన యంత్ర సామాగ్రి వద్దకు వెళ్లాడు. ముల్లంగి దుంపలను చూస్తూ, బెంజామినా, 'మీరేమి చెబుతారు?' అన్నది మిసెస్‌యగ్ ముల్లంగిదుంప తింటూ ఆలోచిస్తున్నది. ఈ పదిరోజులనుంచి బెన్‌జామినా చేసిన వంట ఆదమ్‌కు బాగా నచ్చింది. ఆమె అంటే అభిలాష చూపెట్టాడు. మిసెస్ యగ్ పెద్దగా పిల్చింది. 'బెన్‌జామినా, డామీకి నేప్పులేదని వాని అక్కలు చెబుతున్నారు. వాడు పండురసం వంటినిండా పూసికొని, పెండ్లి వుంగరం యడిత్‌కు యిచ్చుటకు వెళ్లాడు. చెవ్వులు యాపిల్ చెట్టులో పెట్టాడు. వాడు నావికాదళంలో వుండగా ఎంతో పరిశుభ్రంగాను, నీటుగాను వుండేవాడు. ఇంటికొచ్చినదగ్గరనుంచీ మర్యాదకైనా ఒక్కనాడుకూడా

మంచి దుస్తులు వేసికోడు. అర్థచేతుల కాకిచొక్కా ధరించి, క్రిందటిసారి యడిత్ దగ్గరకు వెళ్ళాడు.' అన్నది. బెన్‌జామినా ఆమె సున్నితమైన తెల్లని మునివ్రేళ్లతో ముల్లంగి చెక్క తీసి, 'ఎంతకాలంనుంచి వారిద్దరికి సంబంధం ఏర్పాటు జేసి కున్నారు,' అని ప్రశ్నించింది. 'క్రిష్టమస్ పండుగకు యింటి కొచ్చాడు. 10 రోజులు వానికి స్వేచ్ఛ లభించినది. జడ్జిరాన్ డోల్ఫ ఏర్పాటు జేసిన డ్యాన్సుపార్టీలో వారిద్దరికి సంబంధం ఏర్పడినది. ఎవ్వడు ప్రేమించాలో, ఎవ్వడు ప్రేమించకూడదో తెలియదు. పురుషులు అనుకోనట్లుగా తలవని తలంపుగా ప్రేమలో పడతారు. ఆ ఉద్దేశం తలంపు లేకుండానేవుంటారు. డబ్బు చూచుకొని పిల్లవెంటపడేవారు నాకు తెలుసు అందంగావుంటేకూడా వెంటపడతారు. కాని ఎక్కువమంది పురుషులు ఎక్కువమంది స్త్రీలను పెండ్లియాడటం నాకు తెలియదు. నాకు నలుబది ఆరు సంవత్సరాలున్నవి. జరుగు తున్న విషయాలను చూస్తే ఆశ్చర్యంగా వుంటుంది. నీ గోళ్లు గులాబిరంగులోనే ఎవ్వుడూ వుండునా లేక ఆవిధంగా తయారు జేశావా ?' అన్నది. 'అవి సహజంగానే అట్లా వుంటాయి.' అన్నది బెన్‌జామినా. 'అవి ఎంతో అందంగా వున్నవి. డావిగా అలాగే చెప్పాడు.' అంటూ గదిలోకి వెళ్లినది- ఆ గదిలో ఆడమ్ ఫొటోలు 25 బల్లలమీద, కుర్చీలలోను వున్నవి.

తలుపు వేసినది. సీసాలోవున్న ఒక పిప్పరమెంటు తిన్నది. ఆమెలో ఉద్రేకం పనిచేస్తున్నది. ఆడమ్ బొమ్మ మీద ఈగ వ్రాలితే దానిని తోలి పడకకుర్చీలో కూర్చున్నది. కళ్ళు మూసికొని ఆలోచించినది...యడిత్ సిమ్స్‌కు కోపం

తెప్పించాలనే ఉద్దేశం అయినట్లయితే, ఆదమ్ తెలివిగలపనే చేశాడు. ఆమె దుస్తులందు ప్రత్యేక అభిమానంగా వుంటుంది. అతి నాజూకుగాను జాగ్రత్తగాను వుంటుంది ఆదివారంనాడు వరండాలో 'టీ' తీసికొనేటప్పుడు, జడ్జిరాక్ వోల్ప్ రెండవ కుమారుని చోకాక్కా చూచి మురిసిపోయింది. మెచ్చుకున్నది. మిసెస్సు యగ్ మనో పీధిలో ఊహాలు ఆమెను జీవింప చేస్తున్నవి. వంటయింటిలో చప్పుడయినది. ఆమె లేచింది.

'నేను మూడు ఆవులకు పాలు పితికాను' అంటూ హామీష్, అక్కతో సంతోషంగా చెబుతున్నాడు.

'హామీష్, నీకొక ఉత్తరం వచ్చినది. నీవు చదువు తుంటే నేను చూచాను. మనం ఎక్కడ వున్నామో ఎవ్వరికీ వ్రాయవద్దని నీకు చెప్పాను...యిప్పుడు...' నెమ్మదిగా గట్టిగా అన్నది.

'ఓ, టిక్ మాచ్యూన్‌కు వ్రాశాను. మన బంధువగు 'జో'కు చెప్పడు, బెన్‌జా' అన్నాడు. అతడు వానికి, తల్లికి చెబుతాడు. ఆమె యింట్లో వున్నవారందరికి చెబుతుంది. మనం ఎక్కడకు వెళ్ళామో ఎవ్వరికీ తెలియకూడదని నా అభిమతం.

మిసెస్సు యగ్ లేచికూర్చున్నది. హామీష్ పిల్లవాడై నప్పటికి, పురుషునివలె సంతోషంగా మాట్లాడాడు. 'మన కోసం మన 'జో' యిచ్చుటకు పరుగెత్తుకొని రాడు. మనం వచ్చివేశాం. వానిని నీవు వివాహం చేసికోదల్చలేదని తెలుసు కుంటాడు. ఇష్టం లేకపోయినా గార్డియన్‌మాట సాగవల్సిం

దేనా ? న్యాయశాస్త్రం ఏదైనా వున్నదా- అని ఆదమ్‌ను అడుగుతున్నాను' అన్నాడు హామిూష్.

'నీవు వానికి చెప్పావు'

'చెప్పలేదు'

'పెద్దగా మాట్లాడకు హామిూష్. మిసెస్సు యగ్ మేడ పైన నిదురపోతున్నది. నీవు వానికి చెప్పావు.'

'నే నేమిూ చెప్పలేదు. నాకు తెలిసినవాడొకడు, వాని గార్డియన్‌నుంచి తప్పించుకొని పారిపోయినాడని చెప్పాను' అన్నాడు.

ఈ మాటలకు బెన్‌జామినా వింతగా నవ్వింది.

'వానికి చెప్పివుండాల్సింది. అతడు వచ్చినరోజు నే మనంగాక ఎవ్వరున్నారనే సంగతి వాకబుజేశాడు. 'జో' చుట్ట త్రాగిన పైపులన్నీ పడేసివున్నవి.'

'ఈ వూళ్ళో ఒక జడ్జి వున్నాడు. మిసెస్సు యగ్, ఆదమ్, మనం చిన్న వాళ్ళం కాదని, పిచ్చివాళ్ళంకాదని వానికి చెప్పగలరు. ఒక వేళ 'జో' యిచ్చటకు వచ్చినట్లయితే మన కేం ఫర్వాలేదు- విచారపడకు బెన్‌జీ-జరిగే దేమిూ లేదు. . .నీకు అక్టోబరు మేకు 21 సం॥లు వచ్చును. అప్పుడు కోర్టువారు మనడబ్బు మనకు యిస్తారు. 'జో'కు యివ్వరు. పందెంకూడా వేస్తాను.' అంటూ ఈలవేస్తూ వెళ్ళాడు.

'ఈ ముల్లంగి దుంపలపని పూర్తిచేసి వెళ్ళు. నేను వెళ్ళి తల దువ్వుకోవాలి' అన్నది బెన్‌జామినా.

మిసెస్సు యగ్ పిప్పరమెంట్లు తింటూ మరల పడుకున్నది. వంటయింట్లో 'ఏమిటీగొడవ' అంటూ కుర్చీలో కూర్చున్నాడు. కుర్చీ కిర్ శబ్దం యిచ్చినది. వాడు సరిగా

ముల్లంగి దుంపలను తయారుచేయలేదు అనుకుంటున్నది మిసెస్సు యగ్.

బెన్‌జామినాను పొగడుతూ ఆలోచించినది. పనిచేసే వాళ్ళ స్త్రీల జాబితాలో ఆ అమ్మాయిపేరు ఆదమ్‌చూశాడు. ఇది క్లీవులాండులో జరిగింది. బెన్‌జామినాను కలుసుకొని మాట్లాడాడు. యం. యస్. యస్. నెవాడాలో వంట మనిషిని 'సాండర్సు' అంటారు. ఆ పేరు శుభప్రదంగావున్నది. అకస్మాతుగా జరిగినదే జీవితంలో మూలసూత్రంగా ఉంటుంది. ఆమె అభిలాష చూపినది. అమర్యాదగాను, అసహ్యంగాను వున్నట్టి సంరక్షకుని బారినుండి తప్పించుకొనుటకు తగిన చర్య లన్నీ తీసుకొన్నది.

ఆమెకు ఎట్టి ఆపదరాకుండ కాపాడాలి. ఆదంకు తృప్తిగా వంటచేసేమనిషిని, పేరులేని క్లీవ్‌లాండ్ గార్డియన్‌కు తిరిగి యివ్వటం భావ్యంకాదు. చలికాలంలో ఆదంకు పళ్ళ రసం ఎక్కువకావాలి. మిసెస్‌యగ్ లేచి సరాసరి వంటయింటి లోనికి వెళ్ళి, "అబ్బాయీ నీవు చాలా నేర్పు కలవాడవు. నీకు జ్ఞానము ఉన్నది. ధర్మం, న్యాయం చూడాలి. మీరు మాటాడుకున్నదంతా విన్నాను. మీరు పారిపోయి వచ్చిన ఆ బంధువు'జో' ఎవరు?" అని ప్రశ్నించింది.

హామీష్ ముల్లంగి దుంపను రెండుగా చీల్చాడు. వణుకుతూ 'మానాన్న బంధువు - పేనుబంక వంటివాడు.' అన్నాడు.

'బెంజామినాను నేను వదులుకోవాలనే ఉద్దేశ్యము లేదు. ఆమె మంచి వంటమనిషి. నీవు బాగా పాలు తీయగల

వాడవు. మీ బంధువు యిక్కడకువచ్చి యేదైనా గోల చేసి నట్లయితే వాని సంగతి నేను చూస్తాను. బెంజిమినాకు భయంగా ఉన్నట్లయితే ఆమెకు ధైర్యం చెప్పు' అని అన్నది.

"మిసెస్ యగ్ వంక భక్తి పూర్వకంగా చూచాడు. ఆమె వంట యింటిలోనుంచి వెళ్ళింది. మెట్లు నెమ్మదిగా దిగుతూ బారెన్‌ల వైపుకు వెళ్ళింది. ఆదం అక్కతో కలసి షికారు చేస్తున్నాడు. చికాగోలో అజీర్ణంతో బాధపడే ఒక మతాచారిని ఆమె వివాహం చేసుకొన్నది. ఆవుల మందను పోషించటంలో, కాపాడటంలో ఆదంకు సహాయ పడటం ఆమె పని. తల్లి రావటంచూసి, 'అమ్మా,' అంటూ ఆదం సంతోషంగా అన్నాడు. ఆ సమయంలో ఆదం పాచికలు ఆడుకుంటున్నాడు.

'నువ్వు గెలిచి నట్లుగాని నేనెంతవరకు చూడలేదు. మూడు డాలర్లు గెలుచుకున్నాడు.'

"ఈరోజు నాకు చాల అదృష్టమైన దే అమ్మా!" అంటూ లేచి నిలబడ్డాడు. మిగతా యువకులంతా సంతోష ముతో వినోదంగా నవ్వుకున్నారు. ఆదం సిగరెట్టు ముట్టించి భయం కలిగేటట్టుగా సగంవరకు పీల్చాడు. వరద ప్రవాహం వలే ఆ సిగరెట్టు పొగ వాని నోటినుండి వస్తున్నది. తల్లిని బుజ్జగిస్తూ 'అమ్మా! ఆమె నాకు గాలి నిచ్చింది.' అని అన్నాడు.

'ఏమిటి?' అంటూ గాబరాగా అడిగింది.

'నా గాలి పటమును ఎగుర వేయమని చెప్పినది.. ఆమె జడ్జి రాన్‌డోల్ఫ్ రెండోకుమారుని వివాహము చేసుకో

పోతున్నది. అమ్మా నా భోజమునకు మంచి బ్రాంది, కోడి కూర కావాలి. ఇక ఆపిల్లతో సంబంధం లేదు.' అంటూ జేబులో ఉన్న డబ్బును గలగల లాడిస్తూ, పండ్లికిలిస్తూ, చేతులు త్రిప్పుతూ నాట్యమాడేలాగున అన్నాడు.

'అకస్మాత్తుగా జరిగేవిషయం సరళంగా ఉంటుంది.' అని చెప్పుతూ జడ్జి రాండోల్ఫ్ క్రిష్టమస్ రోజున ఏర్పాటు చేసిన విందును గూర్చి జరిగిన విషయములను సవిస్తరముగా చెప్పాడు. ఇంకో సిగరెట్టును ముట్టించాడు. 'అది అంతే నమ్మా' అన్నాడు. అలుపుగా ఉన్నందువల్ల మాటాడటం మానివేశాడు. "డామీ! నాకు యిప్పుడు హాయిగాఉన్నది. మీ అక్కలంతా యెడిత్‌సిమ్స్‌ను గూర్చి దేవుని కన్నా యెక్కువ గొప్పగా చెపుతారు. నాకు భయం తీరింది. ఆ ఫోనోగ్రాఫ్ ప్లేటు ఏమిటి?" అని యంగ్ అడిగింది.

ఆదం సమాధానము చెప్పలేదు. ఆ ప్లేటు కవరు పైకి తీశాడు. దానిమీద 'కాశ్మీర్ సాంగ్' అని యున్నది. మిసెస్ యంగ్ చూచింది. ఆమె ప్రశాంతముగా ఆలోచించింది. ఇక మీదట 'యడిత్ సిమ్సు' అంటూ ఉండదు. కాని యడిత్ అందంగాను, శాంతంగాను ఉంటుంది డామినీ, ఆమెంతట ఆమె నిలబడలేదనుకుంటాను. ఆమెకు యిష్టములేని వానినుంచి తప్పించుకొని రాలేదనుకుంటాను!' అన్నది యంగ్.

ఆదం చేతితో కొన్ని సంజ్ఞలు చేశాడు. వెంటనే యింటిలోనుంచి ఆమీష్‌వచ్చి, ఆజ్ఞలకు ఎదురుచూస్తున్నాడు. 'నాకు కొన్ని గుడ్డలు తెచ్చిపెట్టు-తెల్లవి-చెప్పులు- సబ్బుపెట్టి- వెళ్ళి తొందరగారా!' అని చెప్పాడు ఆదం.

ఆ పిల్లవాని వంక తదేకదృష్టితో చూస్తూ ముక్క-
పలుపుకుంటూ "చాల మంచివాడమ్మా" అన్నాడు ఆదం.

"అవును. డామీ-బెంజామినాను. పిల్లవాడిని వంట యింటిలో భోజనము చేయమనటం పరిహాసాస్పదముగా ఉంటున్నది. అట్టి అందమైన అమ్మాయిని సంతోషముగా ఉంచాలంటే నేర్పు అవసరము. వాళ్ళను మనతోపాటు మన దగ్గరనే భోజనము చేయమంటే బాగుంటుందిరా డామీ!" అన్నది.

అంగీకార సూచకముగా తల ఊపి యాపిల్ చెట్ల గుండా, ఏ ఉద్దేశ్యములేకుండా, పొలమునకు నీరువచ్చే సెల యేటివద్దకు పరుగెత్తాడు. మిసెస్ యంగ్‌కు, ఆకలి దహించుకు పోతున్నది. నడుస్తూ ఒక సీమరేగి యాకును త్రుంచుతూ నమిలింది. ప్రశాంతంగా డామినా డిన్నర్‌కోసం కోడిమాంసం తయారుచేయుచున్న".

ఆమెచేసే విధానాన్ని చూసి మిసెస్ యంగ్ యెంత గానో మెచ్చుకున్నది. "వేయిస్తే బాగుంటుంది. ఆ విధంగా వండితే డామీకి యిష్టంగా వుంటుంది. నీకు తీరుబడి అయితే దాచిపెట్టిన తేనే, సీమరేగి సారాయిసీసాలు తీసికొనిరా. నలుగురి మనుష్యులకు సీటుగా బల్ల అమర్చు. డామీకి నాతో ఒంటరిగా కూర్చుని తినటం కష్టంగా వుంటుంది...యడిత్ సిమ్స్ సంబంధం వదులుకోవటం జరిగింది. అయినా అది అంత ముఖ్యమైనది కాదు"

"అట్లాగా?"

"ఆ సంబంధం పోయినందుకు ముప్పది సంవత్సరాల వయస్సు కలవారెవ్వరూ విచారపడరనుకుంటాను. వాళ్ళ హృదయం వైకల్యం చెందదని అనుకుంటాను. డామీ శ్రమ నివారణ అయింది. జడ్జి రాండోల్ఫ్ రెండవ పిల్లాణ్ణి యడిత్ వివాహము చేసుకొంటుందట. ఆ పిల్లవాడుకూడా అందముగానే వుంటాడు. వానిజుట్టు ఉంగరాలని తిరిగి నాజూకుగ ఉండినను పళ్ళు యికిలిస్తున్నట్లుగా వుంటాయి. ఆ సంబంధం సంగతి నే నంతగా పట్టించుకోను. కాని నా కుమారుడు మాత్రం బాధపడతారు. డామి శోకాగ్నితో కూలిపో తాడేమో అనిపిస్తుంది. మాంసంతో రామములగకూర చేస్తే డామీ ఎంత ఆనంది స్తాడో నీకు చూపిస్తాను."

"మిసెస్ యంగ్, మీరు అసాధారణమైన వారండీ!" అన్నది బెంజామినా. భయపడిన దానివలె నున్నది. "మీరు ఎప్పుడూ ఉద్రేకము చెందరు" అన్నది మరల బెంజామినా.

"బెంజామినా! ఉద్రేకముతో నాకు పనిలేదు. విషయాలు మంచిగాను, చెడుగాను ఉంటాయి. ఏదైనా గందరగోళం పడటం భావ్యంకాదు. ప్రశాంతంగా, నా అభిమతంగా ఉండటమే నా అభిమతం. ఆదివారమునాడు ఏసుక్రీస్తును ప్రార్థనచేసే బడివలె యెవ్వరు కృతజ్ఞత తెల్పరు.

"నేను యిక్కడకు వచ్చినదగ్గరనుంచీ ఎంతో హాయిగా వున్నది. క్లీవులాండ్‌లో యెండలు మిక్కుటముగా వుంటాయి. అంతా రభసగా వుండేది. నన్ను హామిల్ట‌న్‌ను మీతోపాటు

సమానంగా చూస్తున్నందుకు మీ దయకు నా కృతజ్ఞత."
ఆమె చేతులు నిశ్చలముగా ఉన్నవి. చిరునవ్వు నవ్వింది.

"డామి మాట్లాడకపోయినను వానికి స్నేహితులంటే యిష్టం. వానికి స్నేహంగా ఉండటం ఆనందంగా వుంటుంది. నావికాదళంలో వుండగా, ఎంతోమంది స్నేహితులుండేవాళ్లు. బిస్కట్లుచేసే పిండి యెక్కడయున్నది. సాయంకాలపు భోజనమునకు కొన్ని తయారుచేస్తే బాగుంటుంది."

నిశ్శబ్దంగా బెంజామినా వంటయింట్లోనికి వెళ్ళింది. ఆమె నెమ్మదిగా, ప్రశాంతంగా మాట్లాడుతుంది. మిసెస్ యగ్ బిస్కట్లు తయారుచేసింది. హామిష్ వచ్చాడు. ఫోనో గ్రాఫ్ పిచ్చిపాటలు పాడుతుంటే హామిష్‌ను కేక వేసింది. తరువాత ఆ ఫోనోగ్రాఫ్ పాలిపోయిన చేతులగురించి ఒక ప్రణయగీతాన్ని పాడింది.

'అది కాశ్మీరు పాట!' దగ్గరకు వేసియున్న తలుపును తెరువమంటూ మిసెస్ యగ్ అన్నది. తలుపు తెరిచారు. సంగీతం మధురంగా యున్నది. ఆదం విచారంగా యున్నాడు. 'యిప్పుడు ఎక్కడ ఉన్నావు.' అని ఫోనులోనుంచి పాట వినపడుతోంది.

"ఎంత బాగుంది!" అన్నది యగ్.

'పాలిపోయిన చేతులు, ఎర్రనిరంగు, పద్మంవంటి పూలు-అని వినపడుతున్నది.'

'నిన్నుగూర్చి నే నెంతగానో అనుకొనేవాణ్ణి. నా హృదయంమీద వేసికొని ప్రాణం వదిలేవాణ్ణి. నీ వీడ్కోలు లేకుండా వుండవలసింది.' పాట ముగిసింది. ఆదం గ్రామ

ఫోను ప్లేటును ఆపివేశాడు, కారణం లేకుండానే. యిల్లంతా నిశ్శబ్దంతో నిండిపోయింది. స్వర మాధుర్యంవల్ల వళ్ళంతా చప్ప పడినట్లుగా వున్నది. ఆదం సిగరెట్టు ముట్టించాడు.

"అమ్మా, భోజనము తయారవు తున్నదా ?"

"తయారు కావస్తున్నది" భోజనము ఎంతో హాయిగా నిండుగా వున్నది. ఆవులుగూర్చి ఎంతో ఉల్లాసంగా మాట్లాడాడు హామీష్. అతడు వాళ్ళ తెలివి తక్కువను, కళారసంలేని గుణాలకు మెచ్చుకున్నాడు. బూడిద రంగుగల నేత్ర ద్వయంతో బెంజామినా మైనపు దీపములవంక చూచి కారణం లేకుండానే నవ్వింది. ఆదం పదునాలుగు బిస్కెట్లు, మూడు మణుగుల ఐస్ చేయబడిన కోరింత కాయలను తిన్నాడు. వేడివేడి కాఫీ త్రాగాడు.

'సినిమాకు వెళ్ళుదాం. నీ టోపీ తెచ్చుకో మిస్ శాండర్స్' అన్నాడు.

'కప్పులన్నీ కడగలేదు' అన్నది బెంజామినా.

'హామీష్, నేను ఆపని చేస్తాం.'

మిసెస్ యగ్ ఆవులిస్తూ "తొందరగా నీవనికానీ బెంజామినా" డిన్నరు గదిలోంచి బెంజామినా వెళుతుంటే ఆమె చేతులు వణకటం ఆమె చూచించి. ఆదం సిగరెట్టుపొగ ఉంగరాలలాగ వదులుతూ కాఫీ యున్న బల్లవద్దకు వచ్చి, ఒక కప్పు కాఫీ త్రాగుతూ హామీష్‌వంక చూచాడు.

'ఆమెఎందుకు బెదిరిందిరా.'

"మా కజిన్ 'జో' మాకు గార్డియన్. ఆమెను పెండ్లి చేసుకుంటాడుట – మానాన్న దాచిపెట్టిన డబ్బు ఉన్నది.

'జో' న్యాయవాది యగుటవలన గార్డియన్‌గా వుండుట వలన బ్యాంకు వానికి డబ్బుయిస్తుంది."

'క్లీవ్‌లాండ్‌లో వానిదగ్గర యున్నారా ?'

'మేము ఎక్కడయున్నదీ నీవు చూచావు. బెంజామినా ఆచోటును అందముగా వుంచలేకపోయింది. చుట్టు ఉమ్మితో ఆచోటును 'జో' అసహ్యంగా చేసేవాడు. అక్టోబరుకు బెంజామినాకు 21 సంవత్సరములు వస్తవి. అప్పుడు బ్యాంకువారు ఆమెకు డబ్బు యిస్తారు.'

'అదా సంగతి. జో కఠినుడు ,కోపిష్టి అన్నమాట.'

'అయితే అతడు అందముగా పాడగలడు' అన్నాడు హామీాష్.

పదిగంట లయింది. నిద్దురపోదా మనుకొంటున్నది మిసెస్ యగ్. టెలిఫోనుగంట వినవడింది. ఆమె ఆఖరు కూతురు మాట్లాడుతున్నది.

'అమ్మా! డామీా ఆపిల్లను తీసికొని సినిమాకు వచ్చాడు.' అన్నది.

'నాకు సంతోషంగా వున్నది. వాళ్ళిద్దరూ ప్రత్యేకంగా బాక్సులో కూర్చున్నారుకదా!'

ఈ రోజులలో అమిత వేడిగా వుంటుంది. అందులో బెన్‌జామినా లావుగా వుంటుంది...!

'అమ్మా! యడిత్ వివాహం చేసుకో బోతున్నాడని మనవూళ్ళో అందరూ అనుకుంటున్నారు.'

'అమ్మాయీ, దానికి నేను ఆశ్చర్యంగాని, విచారం గాని నటించలేను. ఆ పిల్లను డామీా పెళ్ళిచేసికుంటే ఒక

గజము వంగి ఆమెను ముద్దు పెట్టుకోవలసి వస్తుంది. అదిబాగా వుండదు. అయినా ఆ పిల్లను నేను విమర్శించదలుచుకో లేదు. సిమ్సు మంచివాళ్ళే-తెలివిగలవాళ్ళు-నాగరికత తెలిసినవాళ్ళు-డామీ మాత్రం తెల్లని దుస్తులు వేసికుంటే అందంగా వుండడూ ?'

'అమ్మా, నీకు హృదయమే లేదు.'

'నీ మాటలు సరేగాని, నాకు డిశెంబరుకు 47 సంవత్స రాలు వచ్చును. గుడ్ నైటు' అన్నది మిసెస్సు యగ్.

మిసెస్సు యగ్ పడక గదికి వెళ్ళినది. పడక దగ్గరగా వున్న బల్లమీద చల్లని పానీయాలు, బిస్కట్లు వున్నవి. కాలాలనుంచి చల్లని మలయమారుతం వీస్తుంటే హాయిగా నిద్దుర పట్టింది. ఆదం గొంతు విని మెళుకువ కలిగింది.

'సినిమా బాగా వున్నదా, డామీ?'

"బాగుంది అమ్మా, నిరుడు నాన్న తెప్పించిన 'లా' డిక్షనరీ ఎక్కడ ఉన్నది?"

'వంటయింటిలో వున్నది.'

'సరేలే అమ్మా!' అంటూ ఆదం నింపాదిగా వెళ్ళాడు.

మిసెస్సు యగ్ నిదురపోయింది. తెల్లవారు ఝామున ఆవులకు పాలు పితికే వేళకు లేచింది. ఆరోజు నిర్మలంగా వున్నది. గ్యారేజికి రంగుపని ఆదం పూర్తిచేస్తాడని అను కున్నది. ఒక బిస్కటుతిని దుస్తులు ధరించినది. యింటి వెనుక భాగమునకు వెళ్ళినది. అచ్చట బెన్‌జామినా కాఫీ విత్తనాలు పొడిచేస్తున్నది.

'తొందరగా నిదుర లేచావా?' అన్నది యగ్.

'తొందరగా వంట పని పూర్తి చెయ్యాలి. ఆలస్యం అయితే బాగావుండదు.'

'వెంటనే భోజనం చేస్తే మంచిది. ఉదయంపూట వానికి బాగా ఆకలిగా వుంటుంది'

'వానికి ఎప్పుడూ ఆకలిగా వుంటుందా?'

'ఓటు ధాన్యంతో నీవు తయారుచేసిన అన్నం వానికి ఎంతో యిష్టంగా వుంటుంది. నీవు వచ్చి పదిరోజులైనది. డామీాకు ఏమికావాలో తెలుసుకున్నావు. వాడి బొటనవ్రేలు కదులుతుంటే వాడు తినేది రుచిగా వునదన్నమాట. వాడు అమిత నేర్పరి.'

'క్లీవులాండు నుంచి కారులో వస్తున్నప్పుడు అమితంగా మాటాడటం ద్వేషిస్తానని చెప్పాడు.' అన్నది బెన్‌జామినా.

దొడ్లో ఆదం పాలుపిటుకుతున్నాడు. మంచు కురుస్తున్నది. చెట్లఆకులన్నీ మంచుతో కప్పబడినవి. హామీాష్ పాల చెంబును తీసికొని వస్తున్నాడు.

ఈ వూళ్ళో హైస్కూలు వున్నది. హామీాష్‌కు బాగావుంటుంది. చికాగోనుంచి నా భర్తవస్తే భయపడకు. వారి ఎడమ కన్ను మెల్లగా వుంటుంది. మరేమీా అనుకోకు. దుమ్ము దులుపుటకు, అందించుటకు, మరొక అమ్మాయిని పనిలో వుంచుతాను.' అన్నది యగ్.

బెన్‌జామినా చాలా అందమైనదని మిసెస్సు యగ్ నిర్ణయించుకున్నది. ఆమె శరీరచ్ఛాయ అంతకంతకు పెరుగుతున్నది. ఆమె ముఖ వర్చస్సు దేవతాస్వరూపిణివలె నున్నది. ఒక పండు తిని ఆ పిల్లను పరీక్షించినది. బెన్‌జామినాను నొక్కి-

పట్టి నెట్టినది. హామీష్ బిత్తరపోయి భయంతో పాలన్నీ ఒలకబోశాడు. కాళ్ళనున్న చెప్పుల నిండా పడ్డాయి.

"అదుగో కజిన్ 'జో' బండిలోనుంచి దిగుతున్నాడు." అన్నాడు హామీష్.

'యిప్పటికి దయ కలిగినది.' అన్నది యగ్.

ఆమె లేచి జుట్టును సర్దుకుంటూ వరండాలోనికి వెళ్ళినది. గేటు దగ్గరనుంచి కుంటుకుంటూ వస్తున్న మనుష్యుడు పొడుగ్గా వున్నాడు. వాని బుజాలు విశాలంగా వున్నాయి. గడ్డిటోపీ పెట్టుకున్నాడు. వాని ఆకృతి చూచేటప్పటికి మిసెస్సు యగ్‌కు అసహ్యం వేసింది. మెల్లగా పక్కకు వెళ్ళినది. ప్రొడ్లోనుంచి హామీష్ వస్తున్నాడు. అతడు ముందుకు వచ్చాడు.

'మిసెస్ యగ్'

'నేనే'

అతడు నమస్కారం చేశాడు. ఆరడుగుల ఎత్తు వున్నాడు. పాలిపోయి మాత్రం లేడు. లావుగానే వున్నాడు. నవ్వుతున్నట్లుగా వున్నాడు. ఆదంవంక చూచాడు. ఆదం మెట్లమీద నిలబడి సిగరెట్టు త్రాగుతున్నాడు. 'నా పేరు హ్యూం అంటారు. నే నొక న్యాయవాదిని. బెన్‌జామినాకు, హామీష్‌కు గార్డియనుగా వుంటున్నాను. వారు నా పినతండ్రి పిల్లలు. యిక్కడ వుంటున్నారని తెలిసుకొని వచ్చాను.'

'నాకు తెలిసినది. మీరు గార్డియన్‌కు తగినట్లుగా లేరు. వాళ్ళు యిక్కడ బాగానే వున్నారు.' అన్నది యగ్.

'వాళ్ళు యిచ్చటనే వుండిపోతారు.' అన్నాడు ఆదం.

ఆదం మాట్లాడుతుంటే మిసెస్సు యగ్ భయపడినది. ఆదం గంభీరంగా ఉన్నాడు. రోషకషాయ నేత్రుడై మండి పడుతున్నాడు. 'డామీ, నీవు భోజనానికి వెళ్ళు, నేను మాట్లాడుతాను.' అన్నది యగ్.

ఆదంకు కోపం రావచ్చు. అతడు తప్పక వెళ్ళాలి. ఒక క్షణకాలం వానివైపు చూచినది. ఆదం వంటయింటిలోనికి వెళ్ళాడు. 'మనం కాలం వ్యర్థం చేస్తున్నాం. బెన్‌జామినా, నా సంరక్షణలోనిది. నా వెంట తిరిగి క్లీవులాండుకు వస్తుంది.' అన్నాడు మెల్లిగా. 'అలా జరుగుతుందని నేను అనుకోను' అన్నది యగ్.

'న్యాయస్థానం చెబుతుంది.'

'అట్టి తీర్పును తీసికొనిరా. బెన్‌జామినా యిక్కడ హాయిగా వున్నది. ఆమెను తిరిగి క్లీవులాండుకు పంపటం జరిగేపని కాదు.'

ఈ ప్రకారంగా చెప్పటం అమర్యాదగాను, తెలివి తక్కువగా వున్నట్లు భావించినది. ఆమెకు కోపంవచ్చినది. పెదిమలు, గడ్డం వణుకుతున్నాయి. అతని గుడ్లు చుట్టకప్పు వేస్తున్నాయి. వాని చొక్కా మెడభాగం అసహ్యంగావున్నది. అతడొక కుక్క. వంటయింటి తలుపు నెట్టినట్లుగా చప్పుడైనది. ఆతడు వానిపై బడి తన్నుతారని ఆమె భయపడింది, 'అమ్మో, దారిలో అడ్డంగా లే. యీవ్యవహారం తేలుస్తాను- బెన్‌జామినా యిటురా - అతడు నిన్నేమి చేయగలడు.' ఆమెచేతిని పట్టుకొని మెట్లదగ్గరకు వచ్చాడు. సిగరెట్టు పొగ వదులుతున్నాడు.

కళ్ళు సగం మూసుకున్నాయి. 'నా పేరు ఆదం. బెన్‌జామినాను వివాహం చేసికున్నాను. వుంగరాలు చూపించు, బెన్‌జా' అన్నాడు.

ఆదం బెన్‌జామినా చేయివదిలాడు. ఆమె సన్నని వ్రేళ్ళకు వున్న వజ్రాల వుంగరం, దానికి పొదిగినరాళ్ళు ధగధగా మెరుస్తున్నాయి. పెండ్లి సంగతి వినేటప్పటికి మిసెస్సు యంగ్ నోటిమీద చేతినిపెట్టుకొని తప్పన్నట్లుగా లోలోన బాధ పడ్డది. ఆదంకు పెండ్లి అయినట్లు యింతవరకు చూడలేదు. సిగరెట్టు పారేసి, 'యింట్లోకు వెళ్ళు' అన్నాడు ఆదం.

చేతికఱ్ఱను ఊతగా పెట్టుకొని, 'నా అనుమతి లేకుండానా!' అన్నాడు ఆ వచ్చిన పెద్దమనిషి.

'ఆమెకు యిరువది సంవత్సరాలు. నీవు ఏమిచేయగలవు?' అరిచాడు ఆదం.

ఏమీ జరగలేదు. బెన్‌జామినా మెట్లుఎక్కి, హామీష్ చేతులుపట్టుకొని నిలబడ్డది. ఆదం వివాహం సంగతి తల్చుకుంటూ, మిసెస్సు యంగ్ హృదయంలో ఆవేదన పొందుతున్నది. ఆ వచ్చిన మనుష్యుని ముఖం వెలవెలా బోతున్నది. ద్వేషం వానిలో పూర్తిగా మూర్తీభవించినది.

'వాళ్ళ ఆస్తిపాస్తులన్నీ నా అదుపు ఆజ్ఞలలో వున్నాయి.' అన్నాడు.

'తగులబెట్టు - వెధవ ఆస్తి!'

హామీష్ ఒకమెట్టు దిగాడు. ఆ వచ్చిన బంధువు చేతిలోని కఱ్ఱను విసిరివేశాడు. 'డామీ' అంటూ మిసెస్సు యంగ్ కేక వేసింది.

ఆ విసిరిన కత్తి సూర్యునకు అడ్డంవున్నట్లుగా వుండి వది. ఆదం నిలబడ్డాడు. వాని కుడి భుజంమీద కత్తిపడి పెద్ద ధ్వనితో క్రిందపడినది. అతడు ధరించిన నలుపుచొక్కా చినిగి పోయినది. బెన్‌జామినా పెద్దగా కేకవేసినది. ఆపాద మస్త కం ఆదం వణికిపోయినాడు. ఒక క్షణకాలంబాటు వాని పెది మలు తెల్లబారినవి. రెండు చేతులుచాచి వాని గొంతు పట్టు కున్నాడు. 'యిప్పుడు నన్ను అపాయమైన ఆయుధంతో కొట్టావు. నన్ను కొట్టావు!– యిరుగో సాక్షులు – యిప్పుడు న్యాయాధిపతివద్దకు తీసికొని వెళ్ళాలి. నీ కొక సంవత్సరం శిక్ష విధించబడును. యిక్కడనుంచి వెంటనే వెళ్ళిపో – లేకపోతే నిన్ను చంపాల్సి వస్తుంది.' అన్నాడు ఆదం.

వాని బుజాలు ఉబికినవి. వాని చొక్కా చినిగినది. బొంగరంవలె ఆ వచ్చిన మనుష్యుడు గడ్డిలో గిరగిరా తిరుగు తున్నాడు. ఆదంచూస్తూ నిలబడ్డాడు. చేతులుఎత్తి సిద్ధంగా వున్నాడు. అతడు గేటువద్దకు పరుగెత్తాడు. అప్పుడు ఆదం చేతులుదింపి చొక్కా తీసివేశాడు. వాని వక్షస్థలం సింధూర వర్ణంగా వున్నది. గీచుకుపోయినది. 'హామీష్' కొద్దిగా ఐయో డిన్ తీసికొనిరా. తెస్తావా?' అన్నాడు.

బెన్‌జామినా మెట్లమీదనుండి పరుగెత్తి ఆమె వేళ్ళకు వున్న వుంగరాలు తీసివేసింది. కలవరపడ్డది. 'ఓ, ఓ ఆదం– చాలావిచారంగా వున్నది. నిన్నుఎందుకు కొట్టవలసివచ్చిందీ?' అన్నది. వాని చేతులలో ఆ వుంగరాలు పెట్టినది. 'అతడు అంత బలంగలవాడా?' అన్నది.

'మనిద్దరకు వివాహముజరిగినట్లుగా సర్టిఫికెట్టు చూపమంటేనేనేం చూపేది? అతడు నన్ను కొట్టడం దౌర్జన్యం క్రింద వస్తుంది. అప్పుడు ఆ పీడ వదలిపోయింది' అన్నాడు ఆదం.

'అయితే డామియా, నీవు వివాహం చేసికొనలేదుగదా?' విచారంగా అడిగింది మిసెస్ యగ్.

'లేదు'

ఆదం యాపిల్ చెట్టు ఆనుకొని బెన్‌జామినా వంక తదేకదృష్టితో చూస్తూ, చేతిలోని వుంగరాలను విప్పుకున్నాడు. ఒక నిమిషం గడిచిన తరువాత ఆమె సిగ్గుపడి తోటలోని చెట్టు కొమ్మలగుండా వెళ్ళింది. ఆదం చినిగిపోయిన చొక్కా గాలికి రెపరెప లాడుతున్నది. కూలీలవంక చూస్తూ, 'ఆ ఆవుల సంగతేమిటి ?' అని ప్రశ్నించాడు.

ఇంతలోకే హామిష్ ఒక చేతిరుమాలా, ఐయోడిన్ సీసాను తెచ్చాడు. మిసెస్సు యగ్ ఆ సీసాను తీసుకొని, 'డామియా యిప్పుడుకూడా మీ అక్కలు నీకు నేర్పుతారంటే హాస్యాస్పదంగా వుంటుంది. ఇంత తొందరలో, యింతదూరం ఎట్లు ఆలోచన చేయగల్గినావు–డామియా?' అన్నది.

ఆదం సిగరెట్టు వెలిగించి పొగవదుల్తున్నాడు. అతని ముఖం ప్రశాంతంగాను, నిర్మలంగాను వున్నది. 'భోజనంలోనికి ఎర్రని పండ్లు కావాలి' అన్నాడు.

'నీకేమికావాలో అదే తీసుకో. బెన్‌జామినా ఓటు ధాన్యంతో అన్నం వండి సిద్ధంగా వుంచింది.'

చేతిలోని వుంగరాలు కిటుక్కుమనేటట్లుగా శబ్దం చేయించాడు. వాని పాదాలు ఆ పచ్చిగడ్డిలో ఆడుతుంటు న్నాయి.

'అమ్మా' అంటూ వింతగా పిల్చాడు.

'అమ్మా, నేను, బెన్‌జామినాను ఒక విపరీతమైన సందిగ్ధ పరిస్థితిలో పెట్టాను. మా యిద్దరకు పెండ్లి జరిగినట్లుగా చెప్పాను.'

'ఈ సంగతి పూరంతా తెలుస్తుంది డామీ'

ఆదం గడ్డిమీదనుంచి లేచి ఒక నిమిషంపాటు తల్లి వంక చూచాడు. వాని ముక్కు రంధ్రాలు అదొకవిధంగా వణికినవి. పెండ్లి వుంగరం తీసి హామీష్‌కు యిచ్చి, 'ఆ వుంగరం మీ అక్కయ్యకు యివ్వు. అది నా బహుమతిగా స్వీకరించమని చెప్పు. నాకు ఎక్కువగా మాట్లాడటం ఏవగిం పుగా వుంటుంది.' అన్నాడు.

ఒయ్యారంగా హామీష్ అక్కవద్దకు వెళ్ళాడు. ఆమె ఒక చెట్టుచాటున వుండి కళ్ళు నులుముకుంటున్నది. అక్కా, తమ్ముడు మాట్లాడుతున్నారు. యిదంతా మిసెస్సు యగ్ గమనిస్తూనే వున్నది. హామీష్‌కు వెనక్కు తిరిగి సంజ్ఞలు చేశాడు. 'మంచిది. గ్రహించాను – ఆమెను యికనుంచీ బెన్ అని పిలుస్తాను' అంటూ మరొక సిగరెట్టు వెలిగించి మెట్లు ఎక్కాడు ఆదం.

'డామీ, ఆమెను ముద్దుపెట్టుకున్నావా?' అన్నది యగ్.

ఆదం నేత్రాలు భయంతో తల్లిని చూచినవి.

'అమ్మా, నాకు దాహం వేస్తున్నది. కొత్త చొక్కా తెచ్చుకోవాలి. ఈ చొక్కాతో నీవు చెప్పినపని......' అన్నాడు ఆదం.

కొత్తగా వచ్చిన ప్రియురాలికి సిగరెట్టును చూపుతూ వంటయింటి తలుపును గభాలున వేశాడు.

# డేగపిల్ల

[వాల్టర్ వాన్ టిల్ బర్గ క్లార్క్ (1909)- నవలలు, కథానికల రచయిత. అతను మెయిన్‌లో జన్మించినను పశ్చిమ అమెరికన్‌లతో కలిసిపోతాడు, నెవాడా వెర్మాంటు విశ్వవిద్యాలయములలో డిగ్రీలు పొందాడు.

అతడు రచించిన 'The wind and Snow of winter' అనే కథానిక ఓ, హెన్రీ బహుమతిని పొందినది. అతడు రచించిన O.X Bow Incident అనే మొకటి నవలను సినిమాగా తీశారు. అదొక చిన్న కావ్యంగా పరిగణించారు. యత్రీవల రచించిన Track of the Cat అనే నవలను A parahle of the tragedy of western man అని వర్ణించారు.

ప్రస్తుతం నెవాడోలోనే నివసిస్తున్నాడు. అప్పుడప్పుడు రచయితల సమావేశములలో ఉపన్యాసములు చేయును. మామూలుగా ఉపన్యాసములంటే వానికిష్టముండదు.

ఈ 'హూక్' అనేకథ The watch full gods and other stories అనే కథానికలనుండి గ్రహించబడినది.]

సెలయేటి పక్కగావున్న వృక్షముల మాటున ఎండిపోయిన చలమ వున్నది. దానిలో డేగపిల్ల పొదగబడుచున్నది. దానిపేరు హూక్. క్షామం వచ్చుటవలన నేల మీద వున్న జీవరాసులన్నీ వందలకొలది చనిపోయినవి.

హూకు్క తల్లి తండ్రులకు బ్రతుకు తెరువు లేక ఆహారంకోసం స్థలం మార్పు వలశ వచ్చినది. ఆహారం సంపాదించే చోటు దూరమగుట వలన రాకపోకలకు యిబ్బందిగా వుంటూన, హూకు్కను పోషించలేక గూటినుండి తరిమి కొండలమీాదికి వెళ్ళిపోయినవి.

హుకు్కకు ఎగరటం యింకనూ రాదు. తల నిటారుగా పెట్టుకొని నేలమీాద ప్రాకులాడుతూ, కష్టాలను సవాలు జేస్తూ, తనచిన్న ఆకురాతి ముక్కుతో ధ్వని జేస్తూ యిసుకపొదలో సంచరిస్తున్నది. యిట్టి అజ్ఞాన దశలోను భయోత్పాదంలో వున్నదశలోనే దాని నేత్రాలు డేగయొక్క ప్రథమగుణాన్ని గ్రహించినవి. నిస్సహాయస్థితిలో వున్నందున చెట్లకు, నదికి మధ్య పెరిగిన పొదలోనే కాలం గడుపుతున్నది. అచ్చట సూర్యరశ్మి మాత్రమే ప్రబలంగా వుంటుంది. అంతా ఎండిపోయి, కదలిక లేకుండా వుంటుంది. ఒకొ్కక్కప్పుడు సముద్రంనుంచి పొగమంచువచ్చి, వర్షంపడి హాయిని గూర్చును.

ఈ సమయంలో హూకు్కచుట్టూ రెండు ధ్వనులు చుట్టుకొని వున్నవి. ఒకటి అడవిలోపెరిగే గోధుమమొక్కలు రాపిడికి ధ్వని, దానికితోడు కాలిఫోర్నియా సింధూర వృక్షముల రాపిడిధ్వని. రెండోది సముద్రపు కెరటాల హోరు. అయితే హూకు్క యీా ధ్వనులను పూర్తిగా వినలేదు. ఏమాత్రపు ఆకులధ్వని వినపడినను అది భయపడేది. రెక్కలు సరిగా రానందువల్ల ఎండిపోయి, ముడుచుకొని ఆహారంలేక మాడిపోతూ, ఆ యిసుకలో వుండే కుమ్మరి

పురుగులను, పేడపురుగులను పట్టుకొని తృప్తిపడేది. సులభంగా ఎగిరే పక్షులు బలంగల పిట్టలు దానిదగ్గరకు వచ్చేవి కావు. కాలక్రమేణా బురదగుంటలోని చేపలను తినటం ప్రారంభించింది. ఉడుతలు పరుగెత్తుతుంటే, వాటి గమనాన్ని చూచేది. రెక్కలను తొందరగా కదిలిస్తేగాని వాటిని పట్టుకొనే అవకాశం లేదు. ప్రయత్నంచేసి విఫలంచెందేది.

అప్పుడప్పుడు సముద్రపు కాకులు కీచు శబ్దం చేసుకుంటూ అచ్చటకువచ్చేవి. ఈదృశ్యం, హూక్కుకు భయంగా వున్నా, పెద్ద పెద్ద పక్షులు దాన్ని భయపెట్టేవికావు. వాటిని చూచినప్పుడు కోపం మాత్రం వచ్చేది. సూర్యరశ్మిలో, రెక్కలను జాపుకొని, ముక్కుతో పొడుచుకుంటూ, పసుపు పచ్చని చిన్న కళ్ళతో వాటినిచూస్తూ వుండేది. సముద్రపు కాకులు వేగంగా రావటం, పోవటం, ఎగరటం చూస్తూంటే హూక్కుకు అమితమైన కోపం వచ్చేది.

నేలమీద తిరిగే ఉలూకపు స్థితివంటి స్థితిని వదులుటకు దానికి అకస్మాత్తుగా మొదట అవకాశం దొరికినది. సూర్యుడు ఎఱ్ఱగా ప్రకాశిస్తూ అస్తమించబోతున్నాడు. ఆ ఎఱ్ఱని కాంతిలో హూక్ పొదమీద నిలబడ్డది. ఆహారంలేక నీరసంగా వున్నది. నేత్రాలు లోతుకుపోయి బద్ధకంగా వున్నది. ఏదో తనపక్కన కదులుతున్నట్లు హఠాత్తుగా తోచింది. ఎండ వేడిమికి తాళజాలక దాహంవల్ల పైకివచ్చిన ఒక ఎలుకను చూచి గబాలున దాన్ని పట్టుకొని చంపినది. ప్రప్రథమంగా నెత్తురు చవిచూడటం వలన దాని స్వభావసిద్ధమైన గుణం వచ్చినది. ఆ చంపివేసిన

ఎలుకను చీల్చి భక్షించినది. ఆఎలుకను తిన్నతరువాత దానికి బలం వచ్చినది. మాటుగా, నీడగా వుండేదాని నివాస స్థలం వదిలి ఆహారంకోసం వెదుకులాడటం మొదలెట్టింది. యింత వరకు పురుగులు, నల్లులు తిని వుండుటవల్ల, నోటి రుచిపోయి నెత్తురు త్రాగాలనే అభిలాష మిక్కుటంగా పెరిగి, బహిరం గంగా చెట్లలో తిరుగుతూ, గూళ్ళరంధ్రాలు చూచినది. చిన్న చిన్నవాటిని పట్టుకొని తినటం ప్రారంభించినది. మాంసం తినుటవల్ల బాగా బలం చేకూరింది. నేత్రాలలోని పసుపు రంగు ముదిరి మెరమెర లాడుతున్నది. సంపూర్ణమైన డేగ రూపు వస్తున్నది. యిట్టి మార్పుదశలో ఒకనాడు ఉడుతను పట్టుకోబోయినది. అది దానిరెక్కలను కొరికి పారిపోయింది. దాన్ని పట్టుకోలేకపోయినను హాక్కు కలత చెందలేదు. భయ పడలేదు. సంతోషంతో పొంగిపోయినది. రెక్కలు బాగా రాకపోయినను, ఈకెలు పెరగకపోయినను నేలమీద తిరిగే ఉడుతలను పట్టుకొనుటకు ప్రయత్నించి విఫలం చెందినది. అవి తప్పించుకొని పోతుంటే, హాక్కుకు కోపం వచ్చేది. చంపుటకు, తినుటకు తన ప్రపంచం విశాలమైనదని గ్రహించి నది. దానియొక్క దివ్యమైన గొప్పతనానికి గర్వపడేది.

ఆరోజునే హాక్కు యుక్తవయస్సులో రెండు పెద్ద సంఘటనలు జరిగినవి. తెలతెల్లవారుతుండగా అది మామూ లుగా ఎగరటంలో విజయం కాంచినది. సూర్యాస్తమయానికి ముందుగా రెండువందల గజాల దూరం ఎగిరినది. ఎగరటం పూర్తికాగానే ఒక ఉడుతను పట్టుకొన్నది. ఆ వుడుత కీచు కీచుమని గోలచేస్తుంటే, వినోదంగా చూస్తూ ఆనందపడ్డది.

దాని బలమైన మాంసం తిన్నతరువాత హూక్కు నిండారుగా నిలబడ్డది. దాని కళ్ళకు నిలకడైన డేగదృష్టి వచ్చినది. ఆ దృష్టి దినదినాభివృద్ధి చెందుతున్నది. ఆహారం సంపాదించటంలో డేగవలె అనుభవం పొందినది. యిప్పటికి మూడు పర్యాయములు ఆహారం సంపాదించుటకు, ఆకలి తీర్చుకొనుటకు ప్రయత్నం చేసింది.

వసంతఋతువు వచ్చేటప్పటికి అది ఆకాశంలో, కొండలలో బాగా ఎగరటం, తిరగటం, గుండ్రంగా పల్టీలుకొట్టడం నేర్చుకున్నది. చెట్లమీద, కొండలమీద, సముద్రంమీద నిరాఘాటంగా, నిర్భయంగా సంచరించటం ప్రారంభించినది.

· ఆ ఋతువులు వర్షాలు మిక్కుటంగా వున్నవి. అది గంటలకొలదిగూటిలోనే వుండవలసివచ్చినది. వానకురుస్తూంటే అది గూనిగా కొంపలో ముడుచుకొని కూర్చుని, నదీలోయలోని కప్పలను తదేకదృష్టితో చూస్తూ, నదీ ప్రవాహంలో కొట్టుకొని వచ్చే చిన్నచిన్న పురుగులను తింటూ కాలంగడిపేది. వర్షాకాలం పూర్తికాగానే మామూలుగా సూర్యరశ్మి, సముద్రపుగాలి ప్రారంభించినది. కొండలన్నీ పచ్చపచ్చని మొక్కలతో నిండిపోయినది. ప్రకృతి శోభాయమానంగా వున్నది. అమిత వర్షాలవలన నదికి వరదలువచ్చి అచ్చటవున్న పెద్ద పెద్ద బండలను ముంచివేసింది. ఆ బండల మీదకు తాబేళ్ళువచ్చి పడుకునేవి. ఆ సమయంలో హూక్కు విపరీతమైన ఆకలితో బాధపడుచున్నది. చంపటం, తినటం మరచిపోయినది. రోజులను అతికష్టముగా గడుపుచున్నది. రాత్రిపూటలేచి తాను వున్నట్టి ఎండిపోయిన చెట్టు

కొమ్మను ముక్కుతో పొడిచి ఆ కొమ్మబెరడును చీల్చివేసింది. కొన్నిరోజులు గడిచాక తరువాత సముద్రతీరానవున్న కొండల పంక్తి చుట్టూ మైళ్ళు సంచరిస్తూ, ఈకలు పెరిగినట్టుగాను, రెక్కలు వణుకుతున్నగాట్లును భావించినది. ఒక చెట్టు బోదె మీద గాలివానచేత తరమగొట్టబడిన ఒక ఆడపక్షినిచూచింది. దానికిజతగా మగపక్షి లేదు. ఆటకాయతనంగా దానిదగ్గర వ్రాలింది. ఆ ఆడపక్షి వయస్సులో పెద్దది. అలసటజెంది వుంటూన హూక్కునుచూచి పెద్దగా అరుస్తూ ఎగిరిపోయింది. దానివెంట పడ్డది.

అరుచుకుంటూ ఆ లోయ పైభాగమున అది పోతూంటే త్రోవలో ఒక మగపక్షి ఎదురైనది. దానికి విశాలమైన పెద్ద రెక్కలున్నవి. ఆరెక్కలంచులు బంగారుఛాయలో వున్నవి. హూక్కు శక్తిసామర్ధ్యలముందు అది పనికి రాదు. దానిని ఒకదెబ్బకొట్టి పక్కకుపోయింది. మరల దెబ్బ కొట్టి పట్టుకొనుటకు ప్రయత్నించినది. కాని లాభంలేకపోయి నది. మరొక దెబ్బ కొట్టినది. ఆ పక్షి రెక్కకు దెబ్బతగిలి వూగులాడుతూ అచ్చటనుంచి తప్పుకొని పొదలమాటుకు పోయింది. గాలిలో ఎక్కువసేపు వుంటూన, దెబ్బలాడుటవలన హూక్కు కాసేపు విశ్రాంతి తీసుకొన్నది. తరువాత ఆకా శంలో ఎగిరిపోయింది.

రెండుమైళ్ళు మైదానంలో విహరించిన తరువాత కొండ శిఖరంమీద ఆ ఆడపక్షిని మరల కొట్టింది. గోళ్ళతో పీకింది. దాని రెక్కలను కొట్టింది. ముక్కుతో మెడ పట్టుకున్నది. తుదకు పోరాటంలో హూక్కు జయంగాంచినది.

వేసవికాలపు ప్రారంభంలో అక్కడ గూటిలోవున్న మూడు పిట్టలను తరిమివేసి హూక్కు స్వేచ్ఛగా విహరిస్తున్నది. ఇప్పుడు అది స్వభావసిద్ధమైన డేగగా రూపొందినది.

ఆ వేసవి అంతా తానే యజమానిగా ఆకాశానికీ కొండలకి తిరిగింది. ఎన్ని గాలిదుమారాలు వచ్చినా వాటిని నిర్భయంగా ఎదుర్కొంటూ, సముద్రపు కాకులకన్నా వడిగా పోవటం నేర్చుకున్నది. ఇప్పుడు గంటలతరబడి ఆకాశంలో విహరించగలదు. పైన సంచరిస్తూ, క్రిందవున్న సూక్ష్మజీవులను, టెలిస్కోపువంటి నేత్రాలతో కనిపెట్టగలదు. రెక్కలను ఆడించకుండా, గుండ్రంగా తిరుగుతూ మైలుదూరం వరకు వెళ్ళగలదు. సునాయాసంగా క్రిందకురాగలదు. దీని నీడను చూస్తేనే, చిట్టెలుకలు, ఉడతలు, కుందేళ్ళు గబగబా గూళ్ళలోనికి పరుగెత్తేవి. వాటిని ఒకదెబ్బలోనే చంపివేసేది. అప్పుడప్పుడు నదిపైకి ఎగురుతూ, సముద్రపు కాకులను క్రిందకు తరిమేది.

యిప్పుడు హూక్కుకు భయమనేది లేదు. దాని శక్తి, ఉత్సాహంగా, పదునుగా, వేగంగా, యుద్ధం చేసేటట్లుగా వున్నది. సముద్రతీరానికి, నదిదగ్గరగా ఒక జపానీసు కుటుంబం కాపుర మంటున్నది. వాళ్ళు వ్యవసాయదారులు. అగోచరమైన వాళ్ళ చర్యలు దానికి బాధగా వుండేవి. ఆ యింటిలోని తినుబండారాలు, వంటకాలు వాసనలు విపరీతంగా వుండును. స్పష్టంగా వుండవు. తెలిసికొనుటకు శక్యంగాకుండా వుండేవి. వాళ్ళు హూక్కును భయంకరంగా చూచేవాళ్ళు. వాళ్ళ దృష్టి నుండి తప్పించుకొనేది. వాళ్ళ దొడ్లమీద, తోటలమీద,

ఘోష్యాపు చేలమీద సంచరించి నప్పటికి, వాళ్ళ యిళ్ళ సమీపంలో మాత్రం వాలేదికాదు.

అయితే యీ అశక్యమైన చోటు దానిజీవితానికి ఆటంకంగా మాత్రం లేదు. దాన్ని ఆలోచనలోనికి తీసికొనేది కాదు. కాని అప్పుడప్పుడు సాయంత్రం వాళ్ళ కోళ్ళదొడ్డి వైపుకు వెళ్ళుతూ, పైకి ఎగురుతూ, మెల్లిగా, ఆదుర్దాగా చూస్తూ విహరించేది. కాలము సక్రమంగా లేనప్పుడు, గాలి ధుమారాలు వచ్చినప్పుడు, పొలాలన్ని ఎండిపోయినప్పుడు ఆకలి దప్పులను తీర్చుకొనుటకు మరొక ప్రదేశానికి వెళ్లేది. తిరిగి పొలాలన్నీ పచ్చపచ్చగా కళాకాంతులతో వున్నప్పుడు వచ్చేది.

ఆ సంవత్సరం నాల్గు పర్యాయములు యితర డేగలను ఎదుర్కోవలసి వచ్చినది. వాటిలో రెంటిని ఆకాశంలోనే కొట్టివేసింది. మూడో డేగ రెక్కను త్రుంచివేసింది. దాని వెంటబడి గడ్డిలోపడేసి చంపి వేశినది. నాల్గోది అమిత బలం గలది. అనుభవం గలది. దానితో ఎక్కువసేపు పోరు సల్పవలసి వచ్చినది. తుదకు కీచులాడి, పొడిచి, అరచి దాని రెక్కలనుకూడా వూడ బెరికింది.

ఇప్పుడు హూక్కుకు అనుమానాలు, సందేహాలు ప్రప్రథమంగా వచ్చినవి. అప్పుడప్పుడు ఆ కొట్లాటనుంచి తప్పుకొని ప్రశాంతంగా వుండేది. పోట్లాటలో జయం పొందినట్లుగా భావించి ఎగిరిపోయే సమయంలో అపక్షి హూక్కును దెబ్బకొట్టింది, రెండూ కలయబడినవి. పోరాటం సాహసంగా జరిగింది. ముక్కులు ముడుతలు పడినవి. కీచుశబ్దం వస్తున్నది.

భూమిమీదను ఎగిరినవి. యాబది అడుగుల దూరంవరకు వచ్చినవి. సమయం కనిపెట్టి హుూక్కు దెబ్బకొట్టినది. ఎదిరి పక్షి రెక్కలన్నీ ఊడి పొదలో పడినవి. పోట్లాటకు పనికి మాలినదై కొండలమీదకు ఎగిరిపోయినది. హుూక్కు విజయం సాధించినందుకు సంతోషపడి నెమ్మదిగా దాని గూటికి జేరినది.

ఈ పోట్లాట లన్నింటిలోను హుూక్కు దెబ్బలుతిన్నది. పోట్లాటలలో అనుభవం సంపాదించినది. అయితే అన్నిటి లోను విజయం గాంచుటవలన తగిలిన దెబ్బలను ఖాతరు చేయలేదు. తన శక్తి సామర్థ్యాలకు ఉప్పొంగి పోయినది. ప్రతిపోట్లాటలోను నూత్న పన్నాగాలను యుక్తులను గ్రహించి నది. తగిలిన గాయాలన్నీ తొందరగా మాని కొరగాని పక్షిగా తయారైనది.

మరుసటి సంవత్సరం వర్షాలు, కప్పల బెకబెకలు తగ్గి పోయిన తరువాత హుూక్కు తిరిగి పోట్లాడవలసి వచ్చినది. నాల్గోతూరి హుూక్కుతో పోట్లాడిన పక్షి హుుందాగలది. సమానమైనది. అచ్చట గూటిలోవున్న ఆడపక్షిని వెళ్ళగొట్టి నది. అంతకుముందే రెంటినితరిమివేసింది. యిప్పుడు హుూక్కు అధికారంలో పరిపూర్ణత చెందినది. నీళ్ళకోంగలు రాత్రి పూట గోలచేసినను కళ్ళు తెరవకుండా హాయిగా నిద్దుర పోయ్యేది.

చలికాలంలో హుూక్కు నడతలో పెద్దమార్పు వచ్చి నది. చిన్నచిన్న పొదలలోవున్న ఆకులన్నీ ఎండిపోయి గల గలా మంటున్నాయి. గాలికి కొండంతా పొగలుక్రమ్మి

తగులబడుతున్నట్లుగా వున్నది. ఒకరోజు మధ్యాహ్నం ఆకాశాన వున్న నల్లని కారుమేఘాలన్నీ సముద్రపు అంచుకు పరుగెత్తినవి. సముద్రపు కెరటాలు హోరుపెట్టుతూ రాళ్ళమీద పడి శబ్దం చేస్తున్నాయి. లోయలలో వున్న పర్వతాలమీద వర్షం కురుస్తున్నది. అట్టి సమయంలో కుహ్యాక నదీ ప్రవాహమునకు అడ్డంగా ఒక మూలనుండి మరొక మూలకు ఎగిరినది. దాని విశాలమైన నేత్రాలు, దుమ్ములలోను ఆకులలో వున్న అతి సూక్ష్మ వస్తువులనుకూడా కనిపెట్టగలవి. పొదమాటునుంచి తుపాకి గురిపెట్టి పొదలోనుంచి లేస్తున్న జపాను వ్యవసాయదారుని తొందరగా గమనించ లేకపోయినది. భయంతో వణికి తప్పించుకొనుటకు తప్పటడుగు వేసింది. రెండుసార్లు తుపాకి దానిమీదకు కాల్చబడినది. మొదటి దెబ్బ అతిసూక్ష్మంగా తప్పిపోయినా రెండోది అతి దారుణంగాను, గాఢంగాను తగిలింది.

దీని అందమైన రెక్కకు దెబ్బతగిలి, నెత్తురు ముక్కులోనికి వచ్చి బాధకు వోర్వజాలక గాలివెంబడి నదీ ప్రవాహం ముందున్న పొదలలో పడిపోయినది. కొమ్మలన్నీ గీచుకున్నవి విపరీతమైన కోపం వచ్చింది. బలం తెచ్చుకొని ముక్కును ఆడించినది. కాని కదిలితే పడిపొయ్యేస్థితిలో వున్నది. రెక్క గాయపడుటవలన లాభంలేదని తెల్సుకున్నది. రాళ్ళలో వేటగాని బూట్లశబ్దం వినపడ్డది. వేటగాని గమనాన్ని చూచి నెమ్మదిగా దట్టమైన పొదలో దాక్కున్నది. వేటగాడు దాని ముందర వుండటంచూచి, కాళ్ళమీద నిలబడి, మంచిరెక్కను పైకెత్తి, పాము బుసకొట్టునట్లుగా తలను ఆడించింది. నోరు

తెరచిందేగాని శబ్దంమాత్రం లేదు. వేటగాడు వెళ్ళిపోయి నాడు. జపాను వ్యవసాయదారుడు ఈ డేగ అనేక పర్యాయ ములు తన దొడ్డిమీద తిరిగినదనియు, కోడిపెట్టలను దొంగి లించినదనియు, అనుకొనెను. చనిపోయిన డేగ అవుసరంలేదని భావించెను.

అతడు వెళ్ళిన తరువాత భయంలేదని నిర్ణయించు కున్న తరువాత బయటకు రాబోయినది. పెద్ద 'షాక్'తిన్నది. దాని అందమైన కనురెప్ప పడిపోయినది. గుండె దడదడా కొట్టుకున్నది. ఊపిరి ఆడకుండా వున్నది. ఎడమ భుజంక్రింద బలమైన గాయం తగిలి విపరీతమైన బాధ పెట్టుతున్నది. కదల టము కూడా కష్టసాధ్యంగా వున్నది. అయినా ధైర్యం ఉత్సా హంగానే వున్నది.

ఆ రాత్రి అంతా పెద్ద పెద్ద మేఘాలు నక్షత్రాల చుట్టూ తిరిగినవి. విపరీతమైన గాలికి పొదలన్నీ కదిలినవి. మరునాడు కూడా వాతావరణం యీ ప్రకారంగానే వున్నది. హూకు కదలకుండా అక్కడనే వుండిపోయినది. రెండో రోజు సాయంత్రం వర్షాలు ప్రారంభించినవి. ఈ ప్రారంభంలో పెద్ద పెద్దవాన చినుకులు ఎండిపోయిన చెట్లమీద, పొదలమీద పక్షి ప్రవాహంలాగా ప్రవహిస్తున్నది. సాయంత్రానికి గాలి వానగా మారినది. దబాటు వర్షం కురిసినది. పొలాలన్నీ బురదగుంటలాగా మారిపోయినవి.

అయినప్పటికి హూకు తన చెట్టుచాటునే వున్నది. చెట్టు కొమ్మలనుంచి వర్ష బిందువులు మాత్రం దానిమీద పడుతున్నవి. దానినేత్రాలు మూసుకుపోయినవి. దానినెత్తురు

అదే రుచి చూస్తున్నది. తుపానులో మార్పువచ్చినది. గాలి వాన హోరులో సముద్రపు అలల హోరు వినపడటం లేదు. తెల్లవారిన తరువాత వర్షం సద్దు మణిగింది. గాలితగ్గి మామూలు వాతావరణం ఏర్పడినది.

హూక్ నింపాదిగా బొట్లు బొట్లుగా నీరు కారుతున్న పొదలనుంచి తప్పుకుంటూ మంచి చోటుకోసరం వెదకటం ప్రారంభించినది. అలసట బాధవలన కదలలేక తరుచు నిలబడి పోతున్నది. మధ్యాహ్నానికి సముద్రపుకొండ మట్టంలో ఒక చిన్న గృహాలాంటి స్థలాన్ని చూచుకున్నది. కొమ్మలు, ఆకులు లేకపోయినా అచ్చటనే వుండుటకు నిర్ణయించుకున్నది.

మూడోరోజు సాయంత్రానికి వర్షం పూర్తిగా వెలిసినది. సూర్యరశ్మి కాంతికి సముద్రం తెల్లగా ప్రకాశిస్తున్నది. మలయమారుతం మందంగా వీచుచున్నది. అయితే హూక్ అతి నీరసంగాను, బలహీనంగాను వున్నది. నేత్రాలలోని కాంతి పోయినది. ఆకలి దహించుకొని పోతున్నది. సముద్రపు కాకులు గుంపులు గుంపులుగా ఎగురుతున్నవి. నదీ ముఖ ద్వారమున చిన్నపిట్టలు, పక్షులు కుహూ కుహూ కుహూ గానాలు విన్నది, పచ్చని మైదానమందు కోలాహలంగా వున్నది. వానకు తడిసి మునిగిపోకుండావున్న పురుగులు ఎండకు ఎండి సంచలనం వచ్చినది. పాములన్నీ తలలెత్తుకొని పచ్చ గడ్డిలోనికి జొరబడుతున్నాయి.

ఆకలితోను కుంటిరెక్కలతోను బయటకు వచ్చి హూక్ ఎండలో నిలబడినది. దానిముందుగానే సముద్రపు కాకులు అండాకారంగా ఎగిరిపోతున్నవి. సముద్రంలోని

అలలు దడదడా కొట్టుకొని యిసుకమీద పడుతున్నవి. యిసుకలోని ఎండ్రకాయలు వాటి తొట్లలోనికి పరుగెత్తు తున్నాయి. సముద్రంలోని రెండు పెద్ద క్రూరజంతువులు తలలు పైకెత్తి పెద్దగా ధ్వనిచేస్తున్నాయి. సాలీడు పాదాలు గల ఒక పెద్ద ఓదె కొంగ వాటిమీద పరుగెత్తినది. కొండ శిఖరం ప్రకాశిస్తున్నది.

ఆ సాయంత్రం హూక్‌కు సుదినము. రెండు సముద్రపు కాకులు తగాదాపడి పట్టుకొన్న చేపను క్రిందకు వదిలినవి. దానిని వెంటనే హూక్ పట్టుకొన్నది. యిది చూడగానే మిగతా కాకులు వచ్చి గోలచేసినవి. కాని హూక్ పట్టువిడవ కుండా మంచి రెక్కతోను, ముక్కుతోను వాటిని తరిమి వేసింది. ఒంటరిగావున్న తరువాత పట్టుకొన్న చేపను తిని, ఎండలో విశ్రాంతి తీసికొని తన గూటికి జేరినది.

ఇక సముద్రతీరానే ఆహారం సంపాదించుకోటం మొదలు పెట్టింది. చిన్న ఎండ్రకాయలను చంపి తినటం నేర్చుకున్నది. నదీ ముఖద్వారంలో మునిగిపోయిన పిచ్చుకలు, ఎలుకలను ఉడుతలను తినేది. రెండుసార్లు అడవికాకులు దానిమీదకు వచ్చినను తెలివిగా తప్పించుకున్నది. నింపాదిగా బలం చేకూ రింది. ఎగురుటకు ప్రయత్నంచేసేదిగాని విఫలం చెందేది. కోపం వచ్చి ముక్కును కొట్టుకొనేది. ఎగరటం నిష్ప్రయో జనం అని గ్రహించినది. తిరిగి తన జీవితం ప్రారంభదశకు వచ్చినదని తెలుసుకున్నది. సంతోషంగా ఆకాశంలో ఎగిరే అవకాశము లేదు. పోట్లాడటం, చంపటం, నెత్తురు త్రాగటం మొదలగు వాటిమీద ఆలోచన ఎక్కువైనది. సముద్రపు

కాకులు తగాదాకు వచ్చునని ఆశించేది. కాని నిరాశచెందేది. ప్రతి రోజు సాయంత్రం ఒకే సమయమునందు అటు వెళ్ళి నారాయణ పక్షిని సవాలుచేసి అవమాన పడ్డది.

అవమానం, కోపం పెరుగుటవలన హూక్ రాత్రిపూట మెళుకువతో వుండేది. ఆకలివల్ల కూడా నిద్దురపట్టేది కాదు. అప్పుడప్పుడు సముద్రపు కాకులు పడేసే ఆహారం చాలేది కాదు. సముద్రపు కాకులు రాత్రిపూట యిసుకలో నిద్దుర పోవునని తెలుసుకున్నది. వాటిని పట్టుకోవాలనే కుటిల ఆలోచన కల్గినది.

ఆకాశంలో చంద్రుడు మసగ మసగగా వున్నాడు. మేఘాలు తిరుగుతున్నాయి. నెమ్మదిగా ఆ సముద్రపు కాకుల లోనికి జొరబడ్డది. ఆనందాన్ని పట్టలేక, కసితీర్చుకుందామనే కోర్కెతో ఒకదాన్ని కొట్టింది. శక్తిలేనందువల్ల దెబ్బ బాగా తగులలేదు. పెద్దగా అనుస్తూ మరల కొట్టినది. చంపినది. యింతలోకే మిగతా కాకులు గందరగోళంగా గుంపులు గుంపులుగా లేచినవి. హూక్ అరవటం, తన్నటం ప్రారంభించినది. తెల్లవారగానే కాకులు వెళ్ళిపోయినవి. హూక్ ఆశా భంగం చెందినది. చంపిన కాకిని నిరుత్సాహంగా తిన్నది. సాయంత్రం సముద్రపు ఒడ్డున నిల్చుని కాకులు ఎంతదూరం వరకు వుండునో గమనించేది. రాత్రిపూట దొంగతనంగా కొన్నింటిని చంపేది. ఒకరాత్రిమాత్రం ఒకమందలో అయిదు కాకులను చంపినది. కాని అన్నింటిని తినలేకపోయినది. ఎప్పుడూ ఒకేతిండి తినుటవలన అయిష్టత ఏర్పడినది. పూర్వం

వున్నట్టి సంతోషం, ఆనందం, స్థిరబుద్ధి యిప్పుడు లేదు. అసంతృప్తిమాత్రం మిగిలినవి.

ఒకరోజున ఒక కాకిని తరిమికొట్టుతూ వున్నప్పుడు కాకిరెక్క తగిలి క్రిందపడినది. యిసుకలోపడి తన్నుకుంటుంటే మిగతా కాకులుజేరి కాకిగోలచేస్తూ, రెక్కను పొడుస్తూ గందరగోళం చేసినవి. కొన్నాళ్ళకు గాయాలు మానినవి. శరీరానికి బలం వచ్చినది. నేత్రాలకు కాంతి వచ్చినది. కొంత వరకు నిలబడేశక్తి కల్గినది. కాని ఆ ఉత్సాహం నిలవలేదు. కుంటెదగుటవలన సముద్రపు కాకులను జేరలేకపోతున్నది. కాకులన్నీ గోలజేస్తూ వచ్చినవి. దానిచుట్టూ గుండ్రంగా ఒరిగినవి. వాటి గోలలో హూక్ ధ్వని వినిపించుటలేదు. నోరు తెరచి వాటిమీదకు దుముకపోయింది. విఫలం చెంది పక్కకు పడిపోయింది. మరల పుంజుకొని నిలబడపోయింది. ఆ సమయంలో మూడు కాకులు కొట్టినవి. తరుముకుంటూ తరుము కుంటూ హూక్‌ను నదిదగ్గరకు తీసికొని వచ్చినవి. అచ్చట వదిలి కాకులు వెళ్ళినవి. సాయంత్రంవరకు నిరాశ, నిస్పృహతో, గుడ్డికన్నుతో కాలం గడిపింది.

కంటి దురదవలన దుమ్ములోపడి రుద్దుకొనేది. దాని వాంఛ కొంత తగ్గినతరువాత, బాధ కొంచెం ఉపశమించిన తరువాత పొదలోనుండి ఆహారం సంపాదించుకొనుటకు సాహసించేది! దానికి తిరిగి భయోత్పాదం కల్గినది. సముద్ర తీరానికి వచ్చుటకు దమ్ము లేకపోయినది. క్రొత్త రకమైన ఆకలితో నెమ్మది నెమ్మదిగా గోధుమ, కాయ ధాన్యాల పొలాలదగ్గరకు ప్రయాణం చేసేది. చనిపోతాననే భయం

కలిగింది. ఈ భయం ప్రారంభదశలోనే వున్నది. తిరిగి దాని మొదటి జన్మస్థలానికి వెళ్ళుతుంటే, మార్గమధ్యలో కాకులు గోలచేసినవి. హూక్ మౌనంగానే వుండిపోయింది. రెక్కతో గాని, ముక్కుతోగాని కాకులను బెదరించలేదు. ఎదుర్కొన లేదు. జాగ్రత్తగా కనిపెట్టుతూ, మార్గాన్ని చూచుకుంటూ, ప్రపంచాన్ని గమనించటంలో ప్రథమ పాఠాలు నేర్చుకుంటూ ఏకాకిగా వెళ్ళినది.

రెక్క లేనందువల్ల చెట్టుకొమ్మను ఎక్కలేకపోయినది. అవమానం భరించలేక విచారపడ్డది. దానికివుండే అహం భావం, గర్వం అణగిపోయినవి. సగం ఆకలితో, శూన్య హృదయంతో అలాగే కాలం గడుపుతున్నది. ఒకనాడు ఒక వింతడేగ దానిమీద ఎగిరినది. నిస్సహాయస్థితిలో వున్నందున ఏమీ చేయజాలక, గుడ్లగూబవలె తల త్రిప్పుకొనుచూ, పిరికిపందవలె పొదలోవున్న గడ్డిలో ముడుచుక కూర్చున్నది. ఈ విధంగా రోజులు, వారాలు గడుస్తున్నవి. ఒకసారి మిక్కిలి పొగరుగల పక్షి ఎగురుకుంటూ వచ్చి హూక్‌ను చావుదెబ్బ కొట్టినది. కాని చంపలేక పోయినది. పొదలోనికి తప్పించుకొని పోయినది. పోట్లాడాలనే వాంఛ, చంపాలనే దృష్టి ఆనందం నశించిపోయినవి. పొట్ట నింపుకొనటమే దాని కనీసపుకోర్కగా మిగిలిపోయినది.

నేలమీద తిరిగే గుడ్లగూబలవలె గోధుమగింజలను ఏరుకుతింటూ, దుమ్ము బురదకొట్టుకుంటూ సర్వదా సగం ఆకలిబాధ పడుతూ గంటలతరబడి నెట్టులపక్కన కాలం గడుపుతూ, అసంతృప్తిగా ఆహారం సంపాదించుకొనేది.

చావుకుముందు తుదినెలలలో ఒకసారి గొప్ప సాహసకృత్యం చేసింది. ఎంద్రకాయ రంధ్రం దగ్గర కావలా వేసింది. దాని చుట్టూ ఎత్తైన పసువువచ్చని గడ్డి వున్నది. అందులో ఒక జాతి పాము తల నిటారుగా వున్నట్లు గమనించినది. అమాం తంగా దానిమీాదకు దుముకినది. కాని పాము బరువుగా వుండుటవలన పట్టు తప్పేటట్లుగా వున్నది. క్రిందకువదలి మరల దెబ్బకొట్టినది. రెండూ కలియబడి సాహసంగా పోరాడినవి. ముక్కుతోను, గోళ్ళతోను పామును పీకి పెట్టినది. దానిని చంపి, మాంసం తిని ఎముకలు, తోలు అచ్చట చీమలకు పురుగు లకు వదిలివేసింది.

వర్షాలు తిరిగి ప్రారంభించినవి. నీటిలో మునిగిపోయిన చిన్న పురుగులను, బొరియలనుండి తప్పించుకొన్న వాటిని తీంటూ కాలం గడిపింది. వర్షాలు మిక్కుటంగా కురుస్తున్నవి. బొరియలు తొట్టులు నీటితో నిండిపోయినవి. ఆకలిబాధ తీర కుండా వున్నది. ఆహారం దొరకక భరించలేకుండా వున్నది. ఈకెలు మాత్రం చుట్టుకొని వుండుటవలన హూక్ బలిసినట్లు గాను, లావుగాను వున్నట్లు కనవడుతున్నది. లోనచూస్తే శరీరం శుష్కించి నరాలకు అంటుకుపోయింది. ఏ పొద మాటునో, బొరియలోనో కాలం గడిపేది. నిద్దుర వచ్చేది కాదు. మెలుకువగా వుండలేదు. దానిస్థితి అయోమయంగా వున్నది. వాన వెలిసేముందు రెండు రాత్రులు ఒక వంతెన క్రింద కాలం గడిపింది. మోటార్లు లారీలు రోదనధ్వని విన్నది. వంతెన ఊగిసలాడేది. హూక్ భయంతో గజగజా వణికేది.



వర్షాకాలం పోయినది. పొలాలు, పొదలు, చెట్లు పచ్చ పచ్చగా వున్నవి. పిట్టలు పాటలు పాడుతున్నాయి. వాతావరణం యింపు సొంపుగావున్నది. ఆకలికి తట్టుకోలేక తన్నుతానే మరచిపోయి నేలతో పొట్లాడేది. తన దుస్థితిని జూచి నిరాశజెంది గడ్డిలో పడి తన్నుకులాడేది. అమితంగా కుమిలిపోతున్నది.

ఋతువు మారింది. పక్షులన్నీ గూళ్ళు నిర్మించుకుంటు న్నాయి. హాక్ శరీరం ముడతలు పడిపోతున్నది. ఆకలి తీరటంలేదు. డేగకువుండే సహజగుణం పోయి బ్రతుకు తెరువు కోసం ప్రాకులాడేది. తిరిగి జపాను వ్యవసాయదారుని పొలము లోనికి జొరబడటం ప్రారంభించినది.

ఎండాకాలం వచ్చినది. పొలాలు, చెట్లు పొదలు ఎండి పోయినవి. రైతులు పొలాల్లో గట్లు గనుములు బాగుజేసు కుంటున్నారు: ఎక్కడా పచ్చగడ్డి అంటూలేదు. జీవితం ఎండు వారినట్లుగా వున్నది. సిగ్గుమాలిన కాకులుమాత్రం పురుగు లను తింటూ ఎగిరిపోతున్నాయి. అట్టి జీవితంతోనే హాక్ తృప్తిపడుతూ కాలం గడుపుతున్నది. తన జాతికిచెందిన పక్షి వచ్చినప్పుడు మాత్రం ఏ మూలకో ఏ మాటుకో వెళ్ళి కాపాడుకొనేది. పురుగులను ఏరుకుతింటూ జీవితం వెళ్ళబుచ్చు తున్నది.

ఎండాకాలం సమాప్తం అయినది. వర్షాలు కురియ లేదు. ఆకుఅలం అంతా ఎండిపోతున్నది. తీగలువున్న పొద కూడా ఎండిపోయి ఆకులు రాలిపోతున్నవి. గడచిన నాల్గు సంవత్సరాలలో క్షామం రావటం యిది రెండవసారి. పశువు

లకు గ్రాసంలేక హీనస్థితికి వచ్చినవి. గాలిదుమారాలు ముళ్ళ పొదలు పెచ్చు పెరిగినవి. పరిస్థితులు అతి భయంకరంగాను దుర్భరంగాను వున్నవి. నదిలోని నీరు ఎండిపోయింది. జపాను వ్యవసాయదారుని యింటిలోనివారంతా తగాదాలుపడి కొట్టుకుంటున్నారు. పక్షుల సంచలనం ఎచ్చటా కాన్పించటంలేదు. జంతుజాలం ఉచ్ఛ్వాస నిశ్వాసములు విడుస్తూ మలమల మాడిపోతున్నవి. వాటి నేత్రాలు నిప్పు కణాల్లాగ మెరుస్తున్నవి.

మొదట్లో చిన్న చిన్న పురుగులను తింటూ కాలం గడిపింది. కొండలన్నీ శూన్యంగా వున్నవి. గడ్డికూడాలేదు. ఎలుకలు, పిచ్చుకలు, ఉడుతలు, తాబేళ్ళుకూడా వందల కొలది చనిపోయినవి. వాటి శరీరంలో నెత్తురు, మాంసంలేదు. దుర్వాసన మాత్రం వస్తున్నది. హూక్ వాటితోనే కాలం గడుపుతున్నది. డిశెంబరునెల ప్రారంభంలో కొండలచూటుకు వెళ్ళేది. అదైనా తనజాతి పక్షులనుండి కాపాడుకొనుటకు వెళ్ళేది. హూక్ తప్పటడుగులు వేస్తున్నది. రెక్కలను, ఈకలను ఆధారంగా పెట్టుకొని సంచరిస్తున్నది. రాను రాను శుష్కించిపోతున్నది. చావుకు దగ్గరలో వున్నది. కంఠం హీనస్వరం పడిపోయింది.

ఒకరాత్రి గాలిదుమారంచే కొట్టబడి దుమ్ములో పడిపోయినది. నెమ్మదిగా తెప్పరిల్లి వ్యవసాయదారుని దొడ్డికి జేరినది. చీకటి గాఢాంధకారంగా వున్నది. ఆకాశంలో చంద్రుడులేడు. నక్షత్రాలు మాత్రం మిణుకు మిణుకు మంటున్నాయి. తీగతో బిగించిన కోళ్ళదొడ్డిముందరకు చేరింది. ఆ దొడ్లో త్రాగుటకు నీరున్నది. తినుటకు కావల్సినంత

ఆహారం వున్నది. కమ్మని వాసన గుమాయిస్తున్నది. నీటిని చూచేటప్పటికి హాక్ కు ఎక్కడలేని సంతోషం వచ్చి నోరు తెరచినది. కాని లాభం ఏమిటి ? దొడ్డిచుట్టూ కైవారం తిరిగి నది. ఎచ్చటా మార్గం గోచరించలేదు. తుదకు తన రెక్కతో తీగెను కొట్టింది. రెక్క దెబ్బతిన్నది గాని, ప్రయోజనం లేక పోయింది. అనేకచోట్ల ముక్కుతో పొడిచినది. కాని తీగెను కదలించలేకపోయినది. తుదిసారిగా ముక్కుతోను, గోళ్ళ తోను తీగను లాగింది. తన్నింది. కొట్టింది. ప్రయోజనం లేక క్రిందపడింది.

మరల గంతులు వేసింది. గోళ్ళతో గట్టిగా తీగెను లాగింది. దొడ్డిపైకి ఎగిరినది. పైభాగాన్ని పట్టుకొని వూగు లాడటంలో దొడ్డిలోనికి పడిపోయింది. ఎక్కడా శబ్దంగాని, సంచలనంగాని లేవు. దాని గుండెమాత్రం శరవేగంతో కొట్టు కుంటున్నది. తొట్టిలోని నీటిని త్రాగింది. కాస్సేపు విశ్రాంతి గైకొన్నది. యిక కోడిపిల్లలమీదకు బయలుదేరినది. చీకట్లో తెల్ల తెల్లగా, మసగమసగగా కనపడుతున్నది. వెంటనే ఒక కోడిపిల్లను కొట్టింది. దాని మెడ విరిచినది. ముక్కలు ముక్కలుగా జేసినది. ఆహారం లేక, రుచి వాసనపోయి, ఎండి పోయి వున్న హాక్కుకు యీ కొత్త నెత్తురును భరించలేక పోయింది. మాంసం తిన్నది. ఆవేశంతో మరొక కోడిపెట్టను కొట్టింది. చంపాలనే కాంక్ష ఎక్కువైనది. మరల కొట్టటం ప్రారంభించినది. కోళ్ళు, పుంజులు చిందర వందరగా గందర గోళం చేస్తున్నాయి.

యిట్టి విద్యలో హ్యూక్ మంచి నేర్పరి. వాటిని వెంటా బడి తరిమింది. అవి చాల గోలగోలచేస్తూ దొడ్డిచుట్టూ తిరుగు తున్నవి. యిదంతా ఒక కోడిపుంజు కనిపెట్టింది. అది తనంత పెద్దది. వెంటనే హ్యూక్ తో కలియబడినది. చీకటి మయంగా వున్నది. రెండూ క్రిందపడి తన్నుకుంటున్నాయి. ఇదంతా గమ నిస్తున్న కుక్క మొరగటం ప్రారంభించినది. వ్యవసాయ దారుడు యింటి కిటికీగుండా దీపంపెట్టి చూచాడు.

దీపం తీసికొని వ్యవసాయదారుడు ముందుకు వచ్చాడు. కోడిపుంజు పౌరుషంతో తల పైకెత్తి అమాంతంగా హ్యూక్ పై బడ్డది. కాని హుక్ చంపివేసినది. విజయం పొందినట్లు కీచు మని అరిచినది. ఆ అరుపులో పటుత్వంగాని బలంగాని లేదు. పేలవంగా వున్నది.

దీపపు కాంతివల్ల హ్యూక్ కు గుడ్డితనం వచ్చినది. వెంటనే కోడి పెట్టలున్న మూలకు పరుగుదీసింది. కోడిపెట్టలన్నీ ఒక్క మారుగా గోలచేసినవి. గాభరాపడి, ధైర్యంతో, విశ్వ ప్రయత్నంమీద ఆ దొడ్డిని ఎగిరి దాటింది. కాని ఏమి లాభం? అక్కడ కావలావున్న కుక్క దాని వెంటపడింది. కోడిపెట్టలు చనిపోవునని వ్యవసాయదారుడు తుపాకీ పేల్చలేదు. యిప్పుడు కాలుద్దామంటే కుక్క అడ్డం వున్నది. డేగ ఎగర లేదని తెలుసుకొని దీపం పట్టుకొని వ్యవసాయదారుడు తగా దాను చూస్తున్నాడు. ఆ దీపపు కాంతిలో వ్యవసాయదారుడు వాని ఆకృతిని చూచుకున్నాడు. శరీరమంతా ముడతలు పడినది. ముఖమంతా నల్లగా వున్నది. బుగ్గలలోని నరాలు బయటకు వచ్చినవి. వంటిమీదవున్న చొక్కా అతుకుల బొంతగా చినిగి

పోయి వున్నది. వాని భార్యకూడా సంస్కారం లేకుండా అదే స్థితిలోవుండి అచ్చటికి వచ్చినది. అక్కడ దృశ్యాన్ని చూచి భయపడి ఆదుర్దాగా నిలబడ్డది. యీలోగా వాళ్ల కుమారుడు కూడా వచ్చాడు. కుక్కను వుసిగొల్పి చూస్తున్నాడు.

దీపపుకాంతిలో కుక్కను ఎదురుగా వుండేలాగున హాక్ చేసినది. తన మంచిరెక్కను ఆడిస్తూ, ముక్కు తెరుస్తూ, బుసకొట్టుతూ కుక్కను తరిమికొట్టుతున్నది. కుక్కకు ధైర్యంలేక తిరిగి మొరగటం ప్రారంభించినది. జాగ్రత్తగా కుక్క గమనాన్ని కనిపెట్టుతూ సంచరిస్తున్నది. కుక్కను వుసికొల్పుతున్నాడు. కుక్క ధైర్యంతో మరల పైబడినది. ఈసారి రెక్కను కొరికింది. అయితే హాక్ కుక్క ముక్కును పట్టుకున్నది. ఆ పట్టు విదిలించుకుని మరల దూకింది. బలం తగ్గిపోతున్నా హాక్ గుండెధైర్యంగానే వున్నది. కుక్కను సవాలు జేసింది. ఏమీతోచక కుక్క మొరగటం మొదలుపెట్టినది. 'పాపం ఆ జేగను చంపివేయండి' అన్నది భార్య.

వ్యవసాయదారుడు కుక్కను తిరిగి ప్రోత్సహించాడు. తిరిగి కుక్క అమాయకంగా పైబడింది. దానిపట్టు తప్పించుకోలేక హాక్ క్రిందపడినది. కుక్కను గోళ్ళతో పీకిబెట్టినది. అయితే కుక్క హాక్ మంచిరెక్కను పట్టుకొని ఈడ్చుకొని పోతున్నది. దీపంలో వ్యవసాయదారుడు, పిల్లవాడు వాటి వెంట వెళ్ళారు. భార్య వెనకాలేవుండి ఆ దృశ్యాన్ని చూడక తప్పిందికాదు. హాక్‌ని యీడ్చుకొనిపోయి మైదానంలో పడేసింది. కరవటం ప్రారంభించినది. మంచిరెక్క దెబ్బతిన్నది.

ఆధారం పోయింది. ఈకెలన్నీ వూడిపోయినవి. దానికన్ను మాత్రం దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. నోరు తెరచింది. శబ్దంలేదు. శక్తి నశించిపోయినది.

వ్యవసాయదారుడు లాంతరు క్రిందపెట్టాడు. చేతులను నులుముకున్నాడు. హాక్ భుజాన్ని కుక్క కరిచింది. మెడ వాలిపోయినది. తుంపులు తుంపులుగా జేసింది.

అయినా తుదిపోరాటంలో హాక్కు డేగ యొక్క శక్తిసామర్థ్యాలు చూపినది. ఒక సంవత్సరంనుంచి భరించుతున్న అవమానాన్ని రూపుమాపుకున్నది. హాక్ ప్రాణం విడిచినది. కుక్క తన యజమానివద్దకు తోక ఆడించుకుంటూ వచ్చినది. కుక్కను మెచ్చుకున్నాడు. వ్యవసాయదారుని భార్య అచ్చటికివచ్చి ఆ పెద్దపక్షిని చూస్తున్నది. భర్త దీపం చూపెట్టాడు.

'ఎంత సాహసంగల పక్షి' అన్నదామె.



# దొంగడి టెక్టివులు

రచన :— యఫ్. స్కాట్ ఫిట్జ్ జరాల్డు

[యఫ్ స్కాట్ ఫిట్ జరాల్డు (1896–1940) This side of Paradise అనే ప్రథమ పుస్తకంలోనే గొప్పవాడైనాడు, ఆ పుస్తకంలో 'Jazz age'ని గూర్చి పరిపూర్ణతగా, స్ఫుటంగా చెప్పినందున అనేకమంది వారిని గౌరవించారు. ఐరిష్ వంశమునకు చెందినవాడు. మిన్నిసోటాలో జన్మించాడు. ప్రిన్సిటన్ విశ్వ విద్యాలయంలో చదువుకున్నాడు. మొదటి ప్రపంచయుద్ధంలో సైన్యంలో పనిచేశాడు.

యుద్ధానంతరం న్యూయార్కులో కథానికలు రచించి కొన్నింటిని ప్రచురించాడు. జల్డా శేరిని వివాహం చేసికున్నాడు. ఆమెకూడా రచయితగా పేరు సంపాదించుకున్నది. వారికి ఒక కూతురు మాత్రం వున్నది. తండ్రిపేరే పెట్టారు. వారి కుటుంబం చాలాకాలము లాంగ్ ఐలాండ్, రివీరా, రోమ్‌లో నివసించారు. 1925లో 'The Great Gatsby' అనే గొప్పనవలను రచించాడు.

చనిపోయిన తరువాత ప్రసిద్ధిచెందిన, మానవుడు. వాని పనిని గూర్చి రచించిన రచనలు గొప్ప నవలారచయితగా పేరు ప్రతిష్ఠలు తెచ్చినవి. 'The Scandal Detectives' అనే కథ స్వీయచరిత్ర వంటిది. దీనిలో రచయిత బాసిల్ పాత్ర వహిస్తాడు. యీ కథ యఫ్. స్కాట్ పిట్ జరాల్డు కథలనుండి గ్రహింపబడినది.]

అది మేనెల ప్రారంభం. ఎండవేడిమి మిక్కుటంగా వున్నది. పిల్లలకు నిమ్మపండు రసం, పానకం యిస్తే, ఐస్‌మ్

జోలికి పోకుండావుంటారని మిసెస్సు బకసీర్ అనుకుంటున్నది. ఆమె ఆ తరానికి చెందినది. అమెరికన్ కుటుంబ జీవితంలో గొప్ప విప్లవకరమైన మార్పులు రాబోతున్న సమయం. ఆమెకు ఆమె తల్లితండ్రులకు వున్న సంబంధంవలె, ఆమె పిల్లలకు ఆమెకుకూడా అట్టి సంబంధం వున్నది. యిది యిరువది సంవత్సరాలనాటి మాట.

మిసెస్సు బక్‌సీర్ మంచి నడతకలది. మిడిల్ వెష్టరన్ సిటీ సొసైటీ సభ్యురాలు. ఆమె ఆలోచనలు ఆమె నాయనమ్మ మాత్రమే గ్రహించగలదు. గుఱ్ఱపుశాలకు పైగా వున్నగదిలో ఏమి జరుగుతున్నదో యిద్దరకు తెలిసేదికాదు. ఆ గదిలో ఒకప్పుడు బండితోలువాడు పడుకునేవాడు. ఆమె కొడుకు, స్నేహితుడు, శూన్యమైన విషయాన్నిగూర్చి పరిశోధన చేస్తున్నట్లుగా వున్నది. భావాలను, జడపదార్థాలను కలిపి ప్రయత్నించు చున్నారు. ఆలోచిస్తున్నారు. ఆమె నిమ్మరసాన్ని తీసికొచ్చి పిల్చింది.

రిప్లయి బక్‌సీర్ ఆ నిమ్మరసాన్ని తీసికొనెను. బాసిల్ డ్యూక్‌పి పరధ్యానంగా చూచి, 'కృతజ్ఞత మిసెస్సు బక్‌సీర్' అన్నాడు.

'పైన ఎక్కువ వేడిగా లేదా?'

'లేదు, బక్‌సీర్, హాయిగా వున్నది.'

ఊపిరి తిరగకుండా వున్నది. అయితే వారు దాన్ని గమనించలేదు. వాళ్లకు దాహంగా వున్న సంగతికూడా వాళ్లు గ్రహించలేదు. రెండు పెద్ద గ్లాసుల నిమ్మరసం గటగటా త్రాగారు. వాళ్లదగ్గర ఇమిటేషన్ తోలుబైండు చేయబడిన

ఒక కాంపోజిషన్ పుస్తకం వున్నది. ఆ పుస్తకం నిమ్మరసంలో తయారు జేసిన సిరాతో వ్రాయబడనది. ఎంతో జాగ్రత్తగా పరిశీలిస్తే. 'The Book of Scandal' రిప్లయి బక్‌నీర్ రచించినది. 'Scandal Detectives' బాసిల్ రచించినది. అని తెలియు చున్నది.

ఈ పుస్తకంలో వారు విన్నంతవరకు తోటి మానవులను గూర్చి సత్యమైన నడవడికి విరుద్ధంగా కొన్ని సంగతులు వ్రాసిరి. కొన్ని విషయాలు తల నెరిసిన ముసలివాళ్లను గూర్చి, మరికొన్ని సాంప్రాదాయాలను గురించి వ్రాశారు. మరికొన్ని విషయాలు యుక్తవయస్సులో వున్న బాలబాలి కలు చేసే పాపపు పనులను గురించి పుకారులు యదార్థాలు వివరించారు. కొన్ని భాగాలు పెద్దలకు విభ్రాంతి కలుగజేస్తాయి. కొన్ని తీవ్రమైన కోపాన్ని కలుగజేస్తాయి. అందులో సమకాలి కుల కుఱ్ఱవాళ్ళను గూర్చి మూడు, నాలుగు రిపోర్టులు వున్నవి. అవి చదివితే తల్లితండ్రులు భయాందోళన చెందుతారు.

అన్నింటికంటే శాంతమైనది రచించినవారికి విభ్రాంతిగా వున్న 'Elwood Leaming has been to the Burlee-que show three or four times at the star' యచ్. పి. క్రామ్‌నర్ యిప్పుడు వూళ్లోకల్లా పెద్దవాడుగాను, గొప్పవాడుగాను వున్నాడు.

ఆ పుస్తకంలోని లోపమల్లా మామూలుగా చదువు టకు పనికిరాదు. సిరా మంచిదికానందువల్ల వ్రాసింది తెలి యదు. కాంతివంతమైన దీపందగ్గరగాపెట్టి చదివితే తెలుస్తుంది. ఏ ఏ పేజీలు ఉపయోగింపబడినవో తెలుసుకొనుటకు అమిత

జాగ్రత్తగా పరిశీలన చెయ్యాలి. ఉపేక్షింపరాని అభియోగమూ యిదివరకే దంపతులమీాద చేయబడినది. భయంకరమైన విషయాలు పొందుబర్చబడినవి. మిసెస్సు ఆర్. బి. కార్తీకయలో బాధపడుతున్నదని, ఆమె కుమారుడు వాల్టరుకారీని బడి నుంచి వెళ్ళగొట్టారని తెలియుచున్నది. పుస్తకం యొక్క ఆశయం అందరిని తిట్టిపోయటంకాదు. ఆ పుస్తకం వారికి కొంత బలాన్ని చేకూర్చినది. యదార్థంగా బాసిల్ యచ్. పి. క్రాన్మర్‌ను చూడలేదు. క్రాన్మర్ బెదిరించినా ఈ పుస్తకం వానియొక్క గత జీవితాన్ని తెలుపుతుంది.

ఈ విషయముదగ్గరనే పుస్తకంలోని కథ పూర్తిగా మారిపోయినదని చెప్పవచ్చును. కొన్ని సంవత్సరాల తరువాత యీా పుస్తకాన్ని నేల తలుపుచాటున వున్న సంగతి ద్వారపాలకుడు కనిపెట్టాడు. పుస్తకం ఖాళీగా వున్నట్లుగా వుంటాన వాని చిన్నక్క పిల్లకు యిచ్చాడు.

వారు అలక్ష్యంగా వున్నట్లు గ్రహించి ఆ యిద్దరు బాలురు సంభాషణ సాగించారు. నాట్యం నేర్పి బడిలో కొన్ని డేవిస్, రిప్లి చదువుకున్నారు; మార్గరట్ టారెన్సు, యిటీవలనే బాసిల్‌తో వేషం వేసింది; ఇమోజిన్ బస్సెల్ యూరప్‌లో ఒక సంవత్సరం వుండి యిటీవలనే తిరిగివచ్చింది. గడిచిన నెలలో బాసిల్‌గాని, రిప్లిగాని ఈ అమ్మాయిలను గురించి ఆలోచించలేదు. యిప్పుడు అనుకోనట్లుగా, హఠాత్తుగా వారి సంభాషణ రహస్యపు గదినుంచి, వాళ్ళవైపుకు మారింది.

'పైకిరాండి' అన్నారు.

'బయటకు రాణి – వార్టన్సు స్థలానికి రాణి.'

'సరే'

యిద్దరు బాలురు వెంటనే బయటకువచ్చి, సైకిళ్ళు ఎక్కి, సందులోనికి వెళ్ళారు.

సాయంత్రం పూట వార్డన్సు స్థలంలో యువతీ యువకులు సమావేశమవుతూ వుంటారు. ఆ స్థలం అందుకోసమే విధిగా నిర్ణయించబడినది. ఆస్థలానికి అనేక ఉపయోగాలున్నవి. అది చాలా విశాలమైనది. వీధిలోనుంచి సైకిళ్ళు మొదలగు బండ్లు వచ్చుటకు వీలుగా వుంటుంది. అందులో ఉయ్యాల వూగుటకుపనికివచ్చే దూలం, వూగులాడుటకు ఉపకరించే రెండు రింగులు వున్నవి. ఇవన్నీ అందులో ఏర్పర్చక పూర్వం లేచివచ్చినవాళ్ళకు, గందరగోళం చేసే బాలురకుపయోగ పడేది. Elwood Leaming and H. P. Cermner చేసిన తప్పిదాలన్నీ పూడ్చిపెట్టారు.

బేసిల్ యొక్క భావాలే పుస్తకరూపకంగా వచ్చినవి. ఆలోచనలను, కల్పనాశక్తిలోని మంచి ప్రతిభగలవాడు, కళ కళలాడే కళ్ళు, గోధుమరంగు జుట్టుకల్గిన 14 సంllల పిల్లవాడు. తెలివిగలవాడు. స్కూల్లో మాత్రం సోమరిగా వుండేవాడు. యీ కట్టుకథలలో అతని అభిమాన పాత్ర Arsene lupin the gentleman buraglar బక్ సీర్ స హాయకారిగా వున్నాడు. బాసిల్ కల్పనాశక్తిని ఆధారంగా తీసుకుని ఏ పనైనా 'మనం చేద్దాం' అనేవాడు. సాయంత్రంపూట యిద్దరూ కూర్చుని జీవితమార్గాన్నిగూర్చి, వాళ్ళలో రహస్యంగా దాగియున్న శక్తి సామర్థ్యాలను వినియోగించి తీవ్రరూపంగా పనిచేసేవారు.

ఆ నేలగదిలో కొన్ని టోపీలు అల్లిక వేసిన సిల్కు జేబు రుమాలాలు, పాచికలు, సంకెళ్ళు వేసే పరికరాలు, కిటికీలగుండా తప్పించుకొనుటకు పనికివచ్చే తాడుకట్టిన నిచ్చెన, వేషాలకు ఉపకరించే సామానులపెట్టె, రంగు రంగుల తలకు కట్టుకునే సన్నని రుమాలాలు వున్నవి. వీటిని అక్రమం, అన్యాయం, కుటిలమైన పనులుచేయుటకు నిర్ణయించినప్పుడు వారు ఉపయోగించేవారు.

వారు నిమ్మరసం పానకం త్రాగటం పూర్తయినది. సిగరెట్లు ముట్టించి దొంగయానం, బేస్‌బాల్ ఆటను వృత్తిగా పెట్టుకొన్నవారిని స్త్రీ పురుషజాతులను గురించి, స్థానికంగా వుండే స్టాక్ కంపెనీని గురించి పైపైన సంభాషణ చేశారు. పక్కసందులో పరిచయమైనవారు మాట్లాడుకుంటూ వస్తున్నట్లుగా తోచినందువల్ల సంభాషణ అంతటితో ముగించారు.

కిటికీలోగుండా పరిశోధన చేశారు. వారి మాటలను బట్టిచూస్తే మార్గరెట్‌టారెన్సు, ఇమోజిన్‌బిస్సెల్, కోన్నీ డేవిస్ అనే బాలికలని తేలిపోయింది. వారికి 13, 1?, 13 సంవత్సరాల వయస్సు వుంటుంది. ఏకాంతంగా వున్నట్లు వాళ్ళు భావించారు. ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ వికటకవిత్వాన్నిగూర్చి ముచ్చటించుకుంటూ వస్తున్నారు.

బాసిల్‌రిప్లయికి టినీ అనువారిని చూచుటకు ప్రయత్నం చేస్తూ, శరీరాలకు చాలినంత దుస్తులు కావని గుర్తుతెచ్చుకుని గడపచాటుకు వెళ్ళారు.

'మీ మాటలు మేమువిన్నాం' అని పెద్దగా అన్నారు. ఆ పిల్లలు ఆగి నవ్వుతున్నారు. మార్గరెట్‌టారెన్సు ఒక రక

మైన జిగురు వంటపదార్థాన్ని నములుతున్నది. బాసిల్ వెంటనే గ్రహించాడు.

'ఎక్కడనుంచి?' అని ప్రశ్నించారు.

'ఇమోజిన్ యింటివద్దనుంచి'

అనేక వృక్షాలు వుండటాన ఎప్పుడూ నీడగా వుంటుంది. వికసించిన పూలచెట్లు వున్నవి. చుట్టూ కుక్కలుకూడా నివసిస్తున్నవి. రెండువందల అడుగుల దూరంలో దారుణమైన పేదరికాన్ని అనుభవించేటట్టి వారు, నీచమైనటువంటి వారు వున్నారు. వాళ్ళను 'మిక్సు' అంటారు. ఆ పేరు వాళ్ళకు వారసత్వంగా వస్తున్నది.

అయిదుగంటలయినది. అచ్చట చిన్నగుంపుగా కొద్దిమంది జేరారు. బాసిల్, రిప్లయి దానిచుట్టూ పరధ్యానముగా సైకిళ్ళతో తొక్కారు. అప్పుడప్పుడు ఒకరిమీద ఒకరు చేతులు చేతులు వేసికొని విశ్రాంతి తీసుకున్నారు. బాసిల్, ఇమోజిన్ బన్నెల్‌వద్దకు త్రొక్కుకొనివెళ్ళి సైకిలుమీదే ఆమెవంక తమాషాగా చూస్తూ వున్నాడు. వాని ముఖంలోని ఏదో ఒకకాంతి ఆమెను ఆకర్షించినది. వానివంక జూచి చిరునవ్వు నవ్వింది. ఆమెకు విశాలమైన గోధుమవన్నె నేత్రాలువున్నవి. అందమైన ఆకారముగల పెద్దనోరు గలది. వలుచని బుగ్గలు, చిరునవ్వు చిందులాడే తెలివైన ముఖం గలది. ఒక క్షణకాలం పాటు బాసిల్ పరికించాడు. ఆమె నవీనంగానే వున్నది. హఠాత్తుగా ఆమెదృష్టి వానివైపుకు మరల్చినది. ఆమె దృష్టి ఆమె వాలకం చూచి ప్రప్రథమంగా జీవితంలోని బాధతో కూడుకున్న ఆనందాన్ని బాసిల్ గుర్తించాడు. అశోక

నిర్ణయమైన అనుభవం. అది వెంటనే తెలివిగా గ్రహించాడు. ఆ వేసవి సంధ్యా సమయాన్ని హఠాత్తుగా ఆమె మరచిపోయింది. చల్లని మలయమారుతం...నీడనిచ్చే ఆషాఢ రిళ్ళు, విరియబోసిన పూలచెట్లు, నారింజ రంగువంటి సూర్య కాంతి, నవ్వులు, పకపకలు, పియానో వాయిద్యపు పాట - యివన్నీ మరచిపోయి ఆమె వానివంక నవ్వుతూ చూస్తూ కూర్చున్నది.

అది అతనికి మితిమీరినట్లుగా తోచింది. ఆ అవకాశాన్ని వినియోగించుకొనే సామర్థ్యం వానికి లేదు. దానిని ఏకాంతముగా అవలోకించి అర్థం చేసికొన్నప్పుడే పరిపూర్ణత చెందగలడు. ఆమెవంక చూడకుండానే అతడు సైకిలుమీద వేగంతో ఆమెదగ్గరగా వలయాకారంగా తిరిగాడు. కొంత కాలం గడచిన తరువాత అతడు తిరిగివచ్చి ఆమెతో యింటికి వస్తానని అడిగాడు. ఆమెకు ఆశ్చర్యంవేసింది. బాసిల్ సైకిల్ మీద ఎక్కి ఆమె ప్రక్కగా యిద్దరూ కలసి రోడ్డుమీదకు వచ్చారు.

'ఈ రాత్రికి నీవు రాగలవా!' ఆదుర్దాగా అడిగాడు.

'మా అమ్మను అడుగుతాను.' అన్నది.

'నీకు టెలిఫోను చేస్తాను. నీవు వస్తేనే నేను అక్కడకు వస్తాను.'

'ఎందుకు ?' వానివంక చూచి నవ్వింది.

'ఎందుకంటే నేనువెళ్ళను. నే చెప్పేది విను. నాకన్నా ఎట్టిబాలురంటే నీకిష్టం.'

'నిన్ను, హుబర్టు బ్లయిర్ అంటే నాకిష్టం.'

తనపేరును ఇంకొకరిపేరుతో కలిపిచెప్పినను బాసిల్‌కు ఈర్ష్య లేదు. హూబర్టుబ్లయిర్‌ను గురించి ఏమీలేదు. వానిని తత్వశాస్త్రజ్ఞునిగా అంగీకరించాలి.

'అందరికంటే నీమీద నాకు ఎక్కువమోజు' అన్నాడు తెలివితక్కువగా.

చిత్రవర్ణంగల ఆకాశాన్ని భరించలేకుండా వున్నాడు. వర్ణింప శక్యంగాని ప్రేమతత్వం ప్రవాహంలాగా వాని నేత్రులలోనుంచి దుముకుతున్నది. వాటిని ఎదురుతున్నాడు. వాటిలో బోటువాని జీవితాన్ని గూడా ఎదురుతున్నాడు.

యిద్దరూ కలిసి ఆమె యింటికి జేరారు.

'బాసిల్ లోపలకురాలేవా ?' అన్నది.

'లేదు.' వెంటనే అది తప్పని గ్రహించాడు. స్పర్శించ గూడని బహుమతి తప్పించుకున్నది. యింకను ఆలస్యం చేశాడు. 'నా నూక్కలు వుంగరం నీకు కావాలా ?' అని అడిగాడు.

'ఔను. నీవు నాకు యివ్వతలుస్తే.'

'ఈరాత్రికి నీకు యిస్తాను.' అన్నాడు. వాని కంఠస్వరం స్వల్పంగా వణికింది.

'నేను వ్యాపారం చేస్తాను.' మరల అన్నాడు.

'దేనికొరకు.'

'ఏదైనా కొంత'

'దేనికి ?'

'నీకు తెలును - నీవుకూడా వ్యాపారం చేస్తావా ?'

ఇమోజిన్ వ్యాకులంగా అటూ యిటూ చూచింది. వస్తారా. అంతా నిశ్శబ్దంగా వున్నది. బాసిల్ ఊపిరి బిగవట్టుకొని వున్నాడు.

'నీవు చాలా భయంకరంగా వున్నావు.' మెల్లిగా అన్నది. అయినా... మంచిది. 'గుడ్ బై' అన్నది.



యిప్పుడు శుభసమయం. బాసిల్ అమితంగా ఆనంద పడ్డాడు. ఈ వేసవికాలంలో అతడు, తల్లి, చెల్లెలు, కలిసి చల్లని ప్రదేశానికి వెళ్ళుతారు. వర్ష ఋతువు రాగానే తను బడికి వెళ్ళాలి. అప్పుడు 'యేల్' వెళ్ళి గొప్ప ఆటగాడుగా పేరుపొందా లనుకున్నాడు.

అతడు వింతవింత కలలు గంటున్నాడు. ఈ వింత ఆలోచనలతో రాత్రిపూట నిద్దురకూడా పట్టుటలేదు.

యిప్పుడు ఇమోజిన్‌ను గూర్చి వెఱ్ఱితనంగా ఆలోచిస్తున్నాడు. యింకా తీక్షణరూపం దాల్చలేదు. సంచలనం వున్న పెద్ద శక్తిగా మాత్రం తయారైనది. అతనికి ప్రీతిగల అనువైన దుస్తులు ధరించాడు. అందంగా తయారైనాడు. చీకట్లో సమావేశమైన గుంపులో కలిశాడు. యింటిపక్కన వున్న యిళ్ళలోని ఆ పిల్లలు, ముగ్గురు, నల్గురు అచ్చట వున్నారు. వారికి రెట్టింపుగా మొగపిల్లలుకూడా వున్నారు. వరండా దగ్గరగా పెద్దవాళ్ళుకూడా వున్నారు. అంతా తమాషాగా ఎకచికాలు, నవ్వులు వికారపు మాటలతో గందరగోళంగా వున్నారు.

తనపేరును ఇంకొకరిపేరుతో కలిపిచెప్పినను బాసిల్‌కు ఈర్ష్య లేదు. హూబర్టుబ్లయిర్‌ను గురించి ఏమీలేదు. వానిని తత్వశాస్త్రజ్ఞునిగా అంగీకరించాలి.

'అందరికంటే నీమీద నాకు ఎక్కువమోజు' అన్నాడు తెలివితక్కువగా.

చిత్రవర్ణంగల ఆకాశాన్ని భరించలేకుండా వున్నాడు. వర్ణింప శక్యంగాని ప్రేమతత్వం ప్రవాహంలాగా వాని నేత్రులలోనుంచి దుముకుతున్నది. వాటిని ఎదురుతున్నాడు. వాటిలో బోటువాని జీవితాన్ని గూడా ఎదురుతున్నాడు.

యిద్దరూ కలిసి ఆమె యింటికి జేరారు.

'బాసిల్ లోపలకురాలేవా ?' అన్నది.

'లేదు.' వెంటనే అది తప్పని గ్రహించాడు. స్పర్శించ గూడని బహుమతి తప్పించుకున్నది. యింకను ఆలస్యం చేశాడు. 'నా నూక్కలు వుంగరం నీకు కావాలా ?' అని అడిగాడు.

'ఔను. నీవు నాకు యివ్వతలుస్తే.'

'ఈరాత్రికి నీకు యిస్తాను.' అన్నాడు. వాని కంఠస్వరం స్వల్పంగా వణికింది.

'నేను వ్యాపారం చేస్తాను.' మరల అన్నాడు.

'దేనికొరకు.'

'ఏదైనా కొంత'

'దేనికి ?'

'నీకు తెలుసు – నీవుకూడా వ్యాపారం చేస్తావా ?'

ఇమోజిన్ వ్యాకులంగా అటూ యిటూ చూచింది. వస్తారా. అంతా నిశ్శబ్దంగా వున్నది. బాసిల్ ఊపిరి బిగపట్టుకొని వున్నాడు.

'నీవు చాలా భయంకరంగా వున్నావు.' మెల్లిగా అన్నది. అయినా...మంచిది. 'గుడ్ బై' అన్నది.



యిప్పుడు శుభసమయం. బాసిల్ అమితంగా ఆనంద పడ్డాడు. ఈ వేసవికాలంలో అతడు, తల్లి, చెల్లెలు, కలిసి చల్లని ప్రదేశానికి వెళ్ళుతారు. వర్ష ఋతువు రాగానే తను బడికి వెళ్ళాలి. అప్పుడు 'యేల్' వెళ్ళి గొప్ప ఆటగాడుగా పేరుపొందాలనుకున్నాడు.

అతడు వింతవింత కలలు గంటున్నాడు. ఈ వింత ఆలోచనలతో రాత్రిపూట నిద్దురకూడా పట్టుటలేదు.

యిప్పుడు ఇమోజిన్‌ను గూర్చి వెఱ్ఱితనంగా ఆలోచిస్తున్నాడు. యింకా తీక్షణరూపం దాల్చలేదు. సంచలనం వున్న పెద్ద శక్తిగా మాత్రం తయారైనది. అతనికి ప్రీతిగల అనువైన దుస్తులు ధరించాడు. అందంగా తయారైనాడు. చీకట్లో సమావేశమైన గుంపులో కలిశాడు. యింటిపక్కన వున్న యిళ్ళలోని ఆ పిల్లలు, ముగ్గురు, నల్గురు అచ్చట వున్నారు. వారికి రెట్టింపుగా మొగపిల్లలుకూడా వున్నారు. వరండా దగ్గరగా పెద్దవాళ్ళుకూడా వున్నారు. అంతా తమాషాగా ఎకచికాలు, నవ్వులు వికారపు మాటలతో గందరగోళంగా వున్నారు.

బాసిల్ అందర్నీ చూచాడు. ఇమోజిన్ రాలేదని నిర్ణయించుకున్నాడు. మార్గరెట్ టారెన్సును చూచాడు. ఆమెను పక్కకు పిల్చి, 'నా పాతవుంగరం యింకా నీ దగ్గరే వున్నదా?' అని ప్రశ్నించాడు. డ్యాన్సింగు స్కూల్లో మార్గరెట్టు వాని విద్యార్థిని. ఆమెను డ్యాన్సింగు పోటీకి కూడా తీసుకొని వెళ్ళాడు. ఆ వ్యవహారం అంతటితో అంతరించిపోయినది. ఏమైనప్పటికి వాని ప్రశ్నమాత్రం అర్థరహితంగా వున్నది.

'అదెక్కడో పెట్టాను ఎందుకు? అది తిరిగి నీకు కావాలా?' అశ్రద్ధగా అన్నది.

'కావాలి.'

'అది నా కవసరంలేదు. నీవే తీసుకోమని బలవంతం పెట్టావు. రేపు తిరిగి నీకు యిస్తాను.'

'ఈ రాత్రికి తిరిగి యివ్వగలవా? అటువంటిదే ఈ రాత్రికి తేవాలను కుంటున్నాను.' గేటులో ఎవరో వస్తున్నట్లుగా చూచి వాని హృదయం వరానం వహించినది.

'అలాగే బాసిల్.'

ఆమె యింటిలోనికి పరుగెత్తుకొని వెళ్ళినది. ఆమె వెంట బాసిల్‌కూడా వెళ్ళాడు. మిస్టరు అండ్ మిసెస్సు టారెన్సు దొడ్లోవున్నారు. మార్గరెట్టు వుంగరంకోసం మేడపైకి వెళ్ళినది. అతనిలోని ఆవేశం ఆమర్దాను చుట్టుకొని, ప్రశ్నలన్నిటికి సమాధానం చెప్పాడు. అవన్నీ యువకులకు అర్థరహితంగా వుంటాయి. యింతలోకే హఠాత్తుగా బిగుసుకొన్నాడు. వాని కంఠస్వరం హీనంగా మారిపోయింది, అతని కాంతివంతమైన నేత్రాలుఒక దృశ్యముమీదకు మళ్ళినవి.

వార్డన్ను యింటికి ముందరగావున్న లాంతరు స్తంభం దగ్గరకు ఒకడు అతివేగంగా వచ్చాడు. జామెట్రిక్ విధానంగా రవరవలైన గుడ్డలు ధరించాడు. ఒక కాలును పైకెత్తి అద్భుతంగా గారడీ విద్యగా చేస్తున్నాడు. అది చూచుటకు అనేక మంది యువకులు అచ్చటికి వచ్చారు. బాసిల్ ఒక చిన్న మూల్గు మూల్గాడు. ఈ రాత్రే హ్యూబట్లుబ్లయర్ వచ్చుటకు నిర్ణయించుకున్నాడని గమనించారు. 'ఈ వేసవిలో చల్లని ప్రాంతానికి వెళ్ళుతానని చెప్పావుకాదూ, అక్కడ యిల్లు ఏదైనా ఏర్పాటుచేసుకున్నావా ?'

ఒకక్షణకాలం గడచిన తరువాత మిస్టరు టూరెన్ను యీ సంగతి మూడోతూరి అడుగుతున్నాడని తెలుసుకున్నాడు.

'లేదండి. క్లబ్బులో వుంటాం'

'అది అందంగా వుంటుందా ?' మిసెస్సు టూరెన్ను అడిగింది.

వీధిలో దీప స్తంభంవద్ద ఇమోజిన్‌ను, ఆమె ఎదురుగాహ్యూబట్లుబ్లయర్‌ను చూచాడు. బ్లయర్ నవ్వుతున్నాడు. ఆ నవ్వు వింటూ బాసిల్ బెదిరాడు. మార్గరెట్ వాని పక్కన నిలబడినంతవరకు ఆమెను గమనించలేదు. వాని వుంగరమును వానిచేతిలో అరిగిపోయిన రాగిడబ్బుగా వుంచింది. ఆమె తల్లి తండ్రులకు అతి ప్రయాసగా కృతజ్ఞత తెల్పి భయాందోళనతో ఆమెతోబాటు వీధిలోనికి వచ్చాడు.

సీతలో నిలబడి, ఇమోజిన్ వంకగాక హ్యూబట్లుబ్లయర్ మీద దృష్టి నిల్పి చూచాడు. హ్యూబర్గులో నిస్సందేహంగా ఏదో కొత్తదనం వున్నది. 15 సం॥లలోపు పిల్లలందు ముక్కు

యొక్క ఆకారమే అందాన్ని ప్రత్యేకంగా తెలియజేయును. అందమైన నేత్రాలు కాంతివంతమైన జుట్టు, ఇంపైన రంగు మీదనే తల్లిదండ్రులు శ్రద్ధ చూపవచ్చును. అయితే ముక్కు అది ముఖంలోవున్న తీరు ఒకటి నొకటి కలిసియుండటం యువకులు ముఖ్యంగా చూస్తారు. మృదువైన, అందచందాలు గల హ్యూబర్టుబ్లయర్ కు సాంప్రదాయమైన ఉబికిన ముఖం వున్నది. ఆ ముఖంలో తీక్ష్ణమైన చెక్కినట్లుగా ముక్కు వున్నది.

అతనికి వ్యక్తిత్వం వున్నది. అందులో సందేహం అనుమానంలేదు. అతడు డ్యాన్సింగు స్కూలుకు వెళ్ళలేదు. వాని తలిదండ్రులు ఒకసంవత్సరంక్రితమే పట్టణానికి వచ్చారు. అయితే అతనికి పూర్వచరిత్ర వున్నది. అతనిని దూషించే బాలురు అనేకమందివున్నారు. అయితే అతని ఆటలలోని శక్తిసామర్థ్యాలను చూచి కొనియాడుతారు. ఆడపిల్లలతో అతని అజాగ్రత్త అతని హాస్యం అతని సంచలనం చూచి అమితంగా భ్రమపడతారు. అనేక సందర్భాలలో యీ విషయాన్ని బాసిల్ కనిపెట్టాడు. యిప్పుడు తిరిగి నిరుత్సాహమైన సంతోషకరమైన నాటకం ప్రారంభమైనది.

హ్యూబర్టు కాలి చెప్పులను తీశాడు. ఒకదాన్ని గుండ్రంగా తిప్పి తోలుతో పట్టుకున్నాడు. ఇమోజిన్ తలలోని రిబ్బను లాక్కొని పరుగెత్తాడు. ఆమె వానివెంట పరుగెత్తింది. నవ్వుతూ సరదాగా పరుగెత్తారు. పాదాలను పెనవేసుకొని, మోచేతితో చెట్టును తన్నిపట్టినట్టుగా నటించి పడకుండా తప్పించుకున్నాడు. పిల్లలంతా తమాషాగా చూచారు.

వాళ్ళుకూడా అదేవిధంగా వింతలు వినోదాలు తమాషాలు చేశారు. హ్యూబర్టు, ఇమోజిన్ టోపీని తీసికొని తన తల మీద రకరకాలుగా పెట్టుకొని ఆడించాడు. ఇమోజిన్ మిగతా ఆడపిల్లలు వింతగా చూచి ఆనందించారు.

యిదంతా చూస్తున్న లాసిల్ సహించలేక అచ్చటకు వెళ్ళి, 'ఏయ్, హ్యూబర్టు, నిన్నే' అని గట్టిగా పిల్చాడు. 'హల్లో - బాసిల్ - ఎందుకు? ఏమిటి?' అంటూ ఆ టోపీని మరొకవిధంగా తలమీద పెట్టుకున్నాడు. ఈ వినోదాన్ని జూచి బాసిల్ కూడా నవ్వక తప్పిందికాదు.

'బాసిల్, బూజిల్, బాసిల్ బూజిల్' అంటూ కేకలు పెట్టుతూ తోటంతా కలయ తిరిగాడు.

'హ్యూబ్, బూబ్,' అంటూ వెంటనే బాసిల్ జవాబు చెప్పాడు. మిగతా పిల్లలంతా దానికి అనేక మారు కేకలు పెట్టినా బాసిల్ అపహాస్యం లోపంగానే వుండిపోయింది.

బాసిల్ ఖిన్నుడైనాడు. విచారం అతని ముఖంలో ప్రస్ఫుటంగా తెలుస్తున్నది. ఆసందడిలో ఇమోజిన్ మోము కొత్త ఆకారాన్ని పొందుతున్నది. అతడు ఆశ్చర్యకరమైన పిల్లవాడు. యిదివరకే అతని హాస్యంతో అమితంగా ఆమెను ముంచివేశాడు. ఆమె అశ్రద్ధకు యిప్పుడామెను ద్వేషిస్తున్నాడు. అయితే అతని వుంగరం కోసం అచ్చట వుండక తప్పిందికాదు.

వంచించే ఉత్సాహంతో మార్గరెట్ తో మాట్లాడాలని ప్రయత్నించాడు. కాని మార్గరెట్ తిరిగి జవాబు చెప్పట

లేదు. ఆ చీకట్లో ఒక బిడ్డకోసం ఎవ్వడో పెద్దగా అరిచాడు. అతనికి భయం వేసింది. ఆ వినోదమైన వేసవి సాయంత్రం దాదాపు పూర్తి అయినది. అందరూ గుంపు గుంపులుగా చీలి పోతున్నారు. యిష్టంలేకపోయినా మార్గరెట్‌ను పక్కకు పిల్చాడు.

'నాదగ్గర వున్నది. యిక్కడే వున్నది. నిన్ను యింటికి తీసికొనివెళ్ళనా?' అని అడిగాడు.

ఆమె వెఱ్ఱిగా అతనివంక చూచింది. అప్రయత్నంగానే ఆమె వుంగరాన్ని అందుకున్నది.

'ఏమిటి? నన్ను, హ్యూబర్టును యింటికి తీసికొని వెళ్ళవలసినదిగా వానికి వాగ్దానం చేశాను.' వాని ముఖం చూడగానే ఆమె భ్రాంతినుండి తప్పుకొని కోపంగా చూచింది.

'నేను యిచ్చటకు వస్తున్నప్పుడు, నీవు మార్గరట్ టూరెన్స్‌తో కలిసి వెళ్ళటం నేను చూచాను!

'లేదు. నేను వుంగరం కోసం వెళ్ళాను.' అన్నది.

'ఔను. నీవువెళ్ళావు. నేను చూచాను.'

ఆమె దృష్టి హ్యూబర్టు వైపుకు మళ్ళినది. అతడు తిరిగి చెప్పులువేసికొని గంతులు వేస్తున్నాడు. గారడీ విద్యతో మంత్రగాడుగా సంచరిస్తున్నాడు. బాసిల్ ఆమెతో వాదోపవాదాలు చేశాడు. కాని ఇమోజిన్ వెళ్ళిపోయినది. నిస్సహాయంగా అతనుకూడా వెళ్ళాడు. చీకట్లో అనేకరకాల ధ్వనులు కేకలు అన్నివైపులనుంచి వినపడుతున్నవి.

'సరే. అమ్మా'

'అక్కడకు ఒక్కక్షణంలో వస్తాను - అమ్మా.'

'అమ్మా, అయిదునిమిషాలు ఆలస్యం కాగూడదా ?'

'తొమ్మిదిగంటలవుతున్నది. నేను తప్పక వెళ్ళాలి.' అన్నది ఇమోజీన్.

ఆమెచేతిని ఊపుతూ, బాసిల్‌వంక వికటంగా నవ్వుతూ వెళ్ళినది. హ్యూబర్టు దుముకుతూ, ఆమెచుట్టూ తిరుగుతూ వెళ్ళాడు. ఒకనిమిషం గడిచిన తరువాత తన్నెవ్వరో స్త్రీ పిలుస్తున్నదని బాసిల్ గ్రహించాడు.

'ఏమిటి?' పరధ్యానంగా అన్నాడు.

'పట్టణంలోకల్లా హ్యూబర్టు బ్లయిర్ చాలా అంద మైన పిల్లవాడు. నీవు చాలా గర్వంగలవాడవు.' అన్నది మార్గరెట్ టారెన్సు.

ఆశ్చర్యంతో బాధగా ఆమెవంక చూచాడు. ఆమె ముఖం ముడుచుకున్నది. బాసిల్ అజ్ఞానంగా ఆమెవంక చూస్తూ, ఇమోజన్, హ్యూబర్టు ఆకారాలు కనబడేవరకు గమనిస్తూ వెళ్ళుతున్నాడు. యింతలోకే ఆకాశంలో ఉరు ములు మెరుపులు వచ్చినవి. వర్షం కురియ నారంభించినది.

అతడు పరుగెత్తటం ప్రారంభించాడు. యింటికి జేరే లోగా తడిసిపోయినాడు. వాతావరణం మారినందున, వర్షం విపరీతంగా కురియుటవలన అతడు నడవలేక 'యూ' అంటూ కేకలు పెట్టుకుంటూ అడుగులో అడుగు వేసుకుంటూ జేరాడు. ఇమోజిన్ వెళ్ళిపోయినది. ఆమెకు దుమ్ముధూళి పడివుంటే అదంతా పోయివుంటుంది. అతని మనస్సులో ఆమె

అందం వాతావరణం హాయిగా వున్నప్పుడు తిరుగాడుతుంది. అయితే యిప్పుడు అతడు ఒంటరిగా వున్నాడు. ఏదో ఒక బల వత్తరమైన శక్తి అతనిలో ఉద్భవించినది. అతడు తోడేలువలె ఒంటరిగా వున్నాడు. సెంపుడుదానివలె లేడు. రాత్రిపూట రహస్యంగా ఆహారంకోసం సంచరించే జంతువువలె వున్నాడు. పిశాచంవలె స్వేచ్ఛగా వున్నాడు. అతడు యింటికి జేరే టప్పటికి అతనిలోని ఆవేశం హమ్యాబర్టు బ్లయిర్ మీాద గంతులు వేస్తున్నది.

దుస్తులను మార్చుకున్నాడు. పైజమాలు గౌను వేసు కొని వంటయింటిలోకి వెళ్ళాడు. అక్కడ ఒక చాక్లెట్ కేకులో నాల్గోవంతు తిన్నాడు. ఒకగ్లాసు పాలు త్రాగాడు. అతనిలోని ఉద్రేకం కొంత తగ్గినది. ఫోనులో రిప్లిబక్నర్ను పిల్చాడు.

'నే నొక ప్లాను తయారుజేశాను.' అన్నాడు.

'దేన్నిగురించి.'

'యస్. డి. తో హెచ్. బి.'ని కొంతచేయటం ఎట్లా?'

ఆ మాటల్లోని అర్థం రిప్లి వెంటనే గ్రహించాడు. ఆ నాయంత్రం మిస్ బిస్సెల్నే కాకుండా మిగతా ఆడపిల్లలను తారతమ్యం లేకుండా ఆకర్షించాడు.

'మనం బిల్లు కాంప్ను తీసికోవాలి' అన్నాడు బాసిల్.

'సరే.'

'నిన్ను ఏకాంతంగా రేపు కలుసుకుంటాను. గుడ్ నైట్' అన్నాడు బాసిల్.



నాలుగురోజుల తరువాత, మిష్టరు, మిసెస్సు జార్జి పి. బ్లయిర్ భోజనం చేస్తున్నప్పుడు, హ్యూబర్టును టెలిఫోనుకు పిలవబడ్డాడు, మిసెస్సు బ్లయిర్ ఆ అవకాశాన్ని పురస్కరించుకొని. ఆమె మనస్సులో వున్నదంతా భర్తతో మాట్లాడింది.

'జార్జి, ఆ పిల్లలు మరల గతరాత్రి వచ్చారు.'

అతనికి కోపం వచ్చినది.

'వారిని నీవు చూశావా ?'

'హెల్డా చూచింది. వాళ్ళలో ఒకర్ని పట్టుకున్నది కూడాను. క్రిందటి మంగళవారంనాడు వారు వ్రాసిన ఉత్తరం సంగతి ఆమెకు చెప్పాను. దానిలో 'మొదటి హెచ్చరిక యస్. డి.'అని వున్నది. అందుకు ఆమె సిద్ధంగానే వున్నది. ఈసారి వారు వెనుకవున్న గంటను మోగించారు. ఆమె అన్నం తింటూనే తిన్నగా సమాధానం చెప్పింది. ఆమె చేతులకు సబ్బు లేకుండావున్నట్లయితే, ఉత్తరం అందించేటప్పుడు ఒకర్ని పట్టుకొని వుండేది. కాని ఆమె చేతులకు సబ్బు రాసుకొని వుండుటవలన జారిపోయినాడు.'

'అతడు ఎలా వున్నాడు ?'

'అతడొక చిన్నమనుష్యుడుగానే వుండొచ్చు. అతడు బూటకంగా వేషంవేసుకున్న పిల్లవాడని ఆమె అనుకున్నది. అతడు పిల్లవాడుగానే ప్రవర్తించాడు. పొట్టి లాగూలు ధరించాడని ఆమె చెప్పింది. మొదటి వుత్తరం మాదిరిగానే వున్నది. 'ద్వితీయ హెచ్చరిక, యస్. డి.' అని వునన్నది.

'అది నీ దగ్గరవుండే, భోజనం పూర్తి అయినతరువాత నేను చూడాలనుకుంటున్నాను.'

ఫోనునుంచి హ్యూబర్టు తిరిగివచ్చాడు. 'అది ఇమోజిన్ బిస్సెల్ అయివుంటుంది. నన్ను ఆమెయింటికి రమ్మనమని కోరుతున్నది. ఈ రాత్రి చాలామంది వెళ్ళుతున్నారు.' అన్నాడు.

'హ్యూబర్టు, యస్. సి. అనే పొడి అక్షరాలుగల పిల్లవాడ్ని ఎవ్వరినైనా నీకు తెలుసునా ?' తండ్రి ప్రశ్నించాడు.

'నాకు తెలియదండి.'

'నీవు ఆలోచించావా ?'

'ఔను. ఆలోచించాను. సామ్ డేలిన్ అనే పిల్లవాడు నాకు తెలును. అయితే వానినిచూచి ఒకసంవత్సరం గడిచినది.'

'అతడెవ్వరు ?'

'వాడొక మొద్దు. నేను వెళ్ళినప్పుడు వాడు 44 నెంబరు బడిలో వున్నాడు.'

'నీ కోసమే వున్నాడా ?'

'అలా అనుకోను.'

'యిదంతా ఎవ్వరు చేస్తున్నారంటావు ? నీ బదులుగా ఎవ్వరైనా చేస్తున్నారా ?'

'నాకు తెలియదు నాన్నా.'

'నాకు నమ్మకంలేదు. ఎవ్వరి పిల్లలైనా కావొచ్చు - నీవుకూడా...'

అతడు మౌనంగా వున్నాడు. తరువాత ఆ ఉత్త రాన్ని చదివాడు. అది ఎట్లసిరాలో వున్నది. ఒక మూలగా దానిలో పుర్రె, ఎముకలు గుర్తు పెట్టబడినవి. అది అచ్చుతో ముద్రించబడినది. దానివలన ఏమీ బోధపడుటలేదు.

ఈలోగా హంబ్రాబర్టు తల్లిని ముద్దుపెట్టుకొని, తలకు టోపీ ధరించి, వంటయింటి గుండా దొడ్లోనికివచ్చి, దగ్గర త్రోవన వెళ్ళుటకు సందునవెళ్ళాడు. ఆ రాత్రి వెన్నెల దేదీప్యమానంగా ప్రకాశిస్తున్నది. కాలిబూటు వదులుగా వుంటే సరిచేయించుటకు ఒక్క క్షణకాలం ఆగాడు. వచ్చి నటువంటి టెలిఫోనుకాల్ మోసం చేయుటకు అని తెలిసి నట్లయితే, అది ఇమోజిన్ యింటివద్దనుంచి కాకపోయి నట్ల యితే, ఫోనులో మాట్లాడినది స్త్రీ కంఠస్వరంగా వుండక పోయినట్లయితే, గేటు ముందరగా వికారంగాను విపరీతం గాను, మసగమసగగావున్న ఆకారాలు తిరగకపోయినట్లయితే అతడు అంత సంతోషంగా, ఆనందంతో, మృదువుగా, చేతులు జేబుల్లో పెట్టుకొని ఆ అందమైన వెన్నెల రాత్రిలో వచ్చివుండేవాడు కాడు.

వాని ఈల ఆ సందులో అనేకమందిని మేల్కొల్పింది. నిర్భయంగా, జయప్రదంగా బాసిల్ టెలిఫోనులో అనుసరిం చాడు. పనువుదీయు పరిశోధకులు తొందరపడినప్పటికి వారు చేసుకున్న ఏర్పాట్లు ఒక క్రమపద్ధతిలో లేవు. ఎవ్వరి త్రోవన వారు వెళ్ళారు. ఒకరి కొకరికి సంబంధములేదు. బ్లయర్సుగేటు బయటకు బాసిల్ వచ్చాడు. బిల్లుకాంప్, తీగతో పెద్ద మీసాన్ని పెట్టుకొని నీడనవస్తున్నాడు. రిడ్లీబర్నర్ పెద్దగడ్డం

ధరించి తాడును చుట్టచుట్టుతూ ఒక వందఅడుగుల దూరాన వున్నాడు. వాళ్ళ పథకానికి ఆ తాడు ఎంతో అవసరం. తీవ్రంగా ఆలోచించినపిదప హ్యూబర్టుబ్లయిర్‌ను ఏమిచేయాలో నిర్ణయించుకున్నారు. వానిని తాడుతో కట్టి, నోరు మూసి, వాని పాకీదొడ్లో పడవేయుటకు నిశ్చయించుకున్నారు.

మొదట్లో యీభావం వారికి భయంకరంగా తోచింది, కాని ఆలోచించగా అదే మంచిదని భావించారు. వాని దొడ్డిని పరీక్షించారు. తగినట్లుగానే వున్నదనుకున్నారు. వారిలో యిద్దరు మాత్రం అంగీకరించక, వానిని సందులోనికి రప్పించి పైబడితే బాగుంటుందని సూచించారు. హ్యూబర్టు వేసిన ఈలను విన్నారు. ముగ్గురూ ఒకరినొకరు సంబంధం లేకుండా నిశ్శబ్దంగా నిలబడ్డారు. రిప్లయితోడులేకుండా తానొక్కడే హ్యూబర్టును కట్టివేస్తె కేకలుపెట్టుతాడు. ఆఅరుపులకు పిశాచంలాంటి వాని వంటమనిషి లేచివస్తాడు. ఈభావం బాసిల్ మనస్సులో మెరిసింది. కాని నిర్ణయించుకోలేకపోయినాడు. ఆ సమయంలోనే హ్యూబర్టు గేటు తెరచి సందులోనికి వచ్చాడు.

అయిదడుగులదూరంలో యిద్దరూ ఒకరిముఖం ఒకరు తేరిపారజూచుకుంటూ నిలబడ్డారు. వెంటనే బాసిల్ మనస్సులో అద్భుతమైన పరిణామం వచ్చినది. హ్యూబర్టుబ్లయిర్ అంటే అతనికెంతో ప్రేమ-వానికి తెలిసిన బాలురందరిలోకి వాన్ని ఎక్కువగా ప్రేమిస్తాడు. ఈ భావం మెరిసేప్పటికి అనుకున్న ప్లాను బాసిల్ మనోవీధినుండి పోయింది. ఈ అవకాశాన్ని ఆలోచనను తట్టుకోలేక సందుగుండా వీధిలోనికి వెళ్ళాడు.

ఒకక్షణకాలంబాటు ఆ పిశాచాన్ని చూచి హ్యూబర్టు భయపడ్డాడు. అది పోగానే, గుండె ధైర్యంచేసి వెంబడించాడు, యాబదిగజాలు వెళ్ళాడు. విసుగుపుట్టి వెనక్కు తిరిగి వచ్చాడు. సందుగుండా వస్తూంటే పొట్టిగాను, బొచ్చుతోనూ వున్న ఒక వింతమనిషి ఎదురైనాడు.

బిల్ క్యాంపు అన్యాయానికి జంకుతాడు. అతడు మంచి స్వభావంకలవాడు. హ్యూబర్టును పాకీదొడ్లో పడవేయుటకు నిశ్చయింపబడినది. హ్యూబర్టుమీద అతని కొంతమాత్రం ద్వేషంలేదు. అతడు సహజమైన స్వభావంకలవాడు. అయినా ఒకపని అతనికి అప్పగించబడినప్పుడు ఆ కార్యము సాధించే వరకు నిద్దురపోడు. కార్యసాధనలో మంచి నేర్పరి.

కారణం తెలియకుండా బాసిల్ చేసినపని యిందుకు ముందుగానే స్వయంగా చూచాడు. హ్యూబర్టు తండ్రి వచ్చి నట్లయితే ఏమిచెయ్యాలని ఆలోచిస్తూండగా, హ్యూబర్టు తండ్రి వాని వెనకాలే వున్నాడు. వానినిచూచి సందులగుండా పరుగెత్తాడు. రిప్లబక్నర్ ఎదురైనాడు. అతడు పరుగెత్తుటకు కారణం తెలుసుకోకుండా వానితో సంతోషంగా కలిసిపోయి నాడు. హ్యూబర్టుకు ఆశ్చర్యం వేసింది. కొంతదూరం వెంబడించి తిరిగి యింటికి హుటాహుటీన వచ్చాడు.

ఈలోగా తన్ను ఎవ్వరూ తరుముకు వచ్చుటలేదని బాసిల్ గ్రహించి తిరిగి సందుదగ్గరకు వచ్చాడు. అతడు భయ పడలేదు. అతడు కార్యం సాధించలేకపోయినాడు. సందులో ఎవ్వరూ లేరు. నిర్మానుష్యంగా వున్నది. బర్గాని, రిప్లయి గాని కనుచూపుదూరంలో లేరు. మిష్టర్ బ్లయిర్ వెనుకగేటు

తలుపు తెరచి, అటూ యిటూ పరికించి, తిరిగి యింటిలోనికి వెళ్ళిన సంగతి బాసిల్ చూచాడు. ఇంటిదగ్గర కొచ్చాడు. వంటయింట్లో మాటలధ్వని వినవడుతున్నది. హ్యూబర్టు పెద్ద గాను, డంబంగాను మాట్లాడుతున్నాడు. మిసెస్సు బ్లయిర్ భయపడుతున్నది. ఇంట్లోవున్న స్వీడిష్ పనికత్తెలు వికటంగా నవ్వుతున్నారు. తెరచివున్న కిటికీలోనుంచి మిష్టర్ బ్లయిర్ టెలిఫోనులో మాట్లాడటం బాసిల్ చూచాడు.

'నేను ప్రధాన పోలీసు అధికారితో మాట్లాడాలి-మాటాడుతున్న జార్జిం - బ్లయిర్ - యిక్కడ బందిపోటు దొంగల ముఠా వున్నది అని మాట్లాడెను.

ఈ మాటలు వినగానే దొంగవలె పెట్టుకున్న బుగ్గ మీసాలనుతీసి వేసి మెరుపువలె వెళ్ళాడు.

ఇమోజిన్‌కు 13 సం॥ దాటినవి. అందువల్ల రాత్రి పూట ఆమెకోసం ఎవ్వరూ వచ్చుటలేదు. ఆమె తల్లి బల్ల మీదపెట్టిన నెలసరిబిల్లులు తనిఖీచూస్తూ ఏమీా తోచక కాలం గడుపుతున్నది. యింతలోకే హ్యూబర్టు బ్లయిర్, వాని తండ్రి ముందర వరండాలోనికి వచ్చాడు.

'నేను యిప్పుడే అనుకున్నాను-నేనేవెళ్ళి వానిని తీసి కొద్దామని' అంటూ మిష్టరు బ్లయిర్ ఆమె తల్లితో అంటు న్నాడు. 'ఈరాత్రి బందిపోటు దొంగలు మనసందులో తిరుగు తున్నట్లుగా తోచింది.'

అనుకోనట్లుగా వచ్చినందుకు మిసెస్సు బిస్సెల్ విశ్రాంతి చెందినది. లూను మిసెస్సు బ్లయిర్ వద్దకు వెళ్ళి పిలవలేదు కూడాను.

'హ్యూబర్టును చూచుటకు ఇమోజిన్ సంతోష పడు చున్నది. ఇమోజిన్ కూడా...' అన్నది.

'ఈ దొంగలముఠా హ్యూబర్టుకోసమే వచ్చారను కుంటాను. వాడు చాలా విచిత్రమైన పిల్లవాడు. ఏదో విధంగా వాళ్ళను తరిమివేశారు. ఏమైనా వాణ్ని యిక్కడకు ఒంటరిగా పంపటం నాకు యిష్టంలేదు.' అని మిష్టరు బ్లయిర్ చెప్పాడు.

'నిజమేనండి' అన్నది ఆమె హ్యూబర్టు అసలు యిచ్చ టకు ఎందుకురావాలో ఆమె కర్థంకాలేదు. వాడు అందమైన చిన్నపిల్లవాడు. ఏదో మూడురోజులలోను సాయంత్రం పూట ఇమోజిన్ వానితోకలసి తిరిగింది. మిసెస్సు బిస్సెల్ కు కోపం వచ్చినది. మిష్టర్ బ్లయిర్ ను లోనికి రమ్మనమని హీన స్వరంలో చెప్పినది.

వారు యింకా హాల్లోనే వున్నారు. మిష్టరు బ్లయిర్ అంతా పరికించి చూస్తున్నాడు. తలుపు తెరచి చూచాడు. ఎఱ్ఱని ముఖంతో. ఊపిరిలేనట్లుగా బాసిల్ పక్కగా నిలబడి వున్నాడు.

'మిసెస్సు బిస్సెల్, ఎలా వున్నాడు? హాల్లో, ఇమా జిన్!' అంటూ పెద్దగొంతుకతో అన్నాడు 'ఏది నీ పార్టీ?'

ఈ మాటలు విన్న ఏ పెద్దమనిషి అయినా అవి అస్వ భావికంగాను మొరటువుగాను న్నట్లుగా తోస్తాయి.

'పార్టీ ఏముంది?' ఇమోజిన్ ఆశ్చర్యంతో అన్నది.

'ఏమిటిది?' బాసిల్ భయంతోను, వణుకుతోను,

'అయితే నన్ను నీవు పిల్వలేదని చెబుతున్నా వన్న మాట. అదేనా నీ అర్థం.'

"ఎందుకు, అదికాదులే లాసిల్!"

అనుకోనట్లుగా హ్యూబర్టు వచ్చినందుకు ఇమోజిన్ సంతోషపడ్డది. యిది కనిపెట్టి చెడగొట్టుటకు బాసిల్ యీ ఉపాయం పన్నాడని ఆమె అనుకున్నది. ఆమె చాలామటుకు యదార్థానికి దగ్గరగా వున్నది. బాసిల్‌యొక్క ఆలోచనను తక్కువ అంచనా వేసింది. ద్వేషం కాదనుకున్నది.

'నన్ను పిలవలేదా ఇమోజిన్?' అన్నాడు. హ్యూబర్టు

'ఎందుకు, లేదు హ్యూబర్టు-నేను ఎవ్వరినీ పిలవలేదు.' అన్నది.

తలుపుదగ్గర వున్న గంట మ్రోగింది. రిప్లయిబర్‌నర్, విలియమ్ యన్. క్యాంపు యిద్దరూ వచ్చారు. వాళ్ళుకూడా గట్టిగాను మొరటుగాను మాట్లాడారు. ఇమోజిన్ పార్టీకి రావలసినదిగా ఫోనులో చెప్పిందన్నారు.

హ్యూబర్టు నవ్వాడు. మిగతావాళ్ళుకూడా నవ్వటం మొదలెట్టారు. హ్యూబర్టుమీద ఇమోజిన్‌కు నమ్మకమున్నది. వానిని నమ్మటవలన, అందరు చెప్పినది నమ్మట ప్రారంభించి నది. అప్రయత్నంగా సంభవించిన యీ సమావేశమును జూచి, హ్యూబర్టు తనలోన వుడుకుతున్న సంగతులను తన సాహసకృత్యాన్ని చెప్పటం ప్రారంభించాడు. 'దొంగల ముఠా మనకొరకు తిరుగుతున్నదనుకుంటాను. నేను సందులోనికి వెళ్ళినప్పుడు నన్ను పట్టుకొనుటకు పన్నాగం పన్ని కొంత మంది రహస్యంగా తిరుగుతున్నారు. తెల్లని బుగ్గమీసాలు

వున్న ఒక ఆజానుబాహుడున్నాడు. అయితే నన్ను చూడ
గానే పరుగెత్తాడు. తరువాత సందులోనికి వెళ్లాను. అక్కడ
గుంపుగా వున్నారు. విదేశీయులుగా వున్నారు. వాళ్ళ వెంట
పడ్డాను. వాళ్ళూ పరుగెత్తుకొని వెళ్ళారు. వాళ్ళను పట్టుకొను
టకు ప్రయత్నించాను. వాళ్ళు నాకన్నా వేగంతో పరు
గెత్తారు. వాళ్ళు మంచివాళ్ళైనని గ్రహించాను.'

హ్యూబర్టు, వాని తండ్రి కథలో నిమగ్నులై వుంటాన,
కథ ఎంతో ఉత్సాహంగా వుండుటవలన కథను వినేవారిలో
ముగ్గురి ముఖాలు వివర్ణంగా మారుతున్న సంగతి వారు గమ
నించలేదు. పెద్దగా నవ్వుతూ, నిజంగా మనకు పార్టీ వున్నదని
చెప్పుతున్న మిసెస్సు బస్సెల్‌నుకూడా గమనించలేదు.

'హెచ్చరికను గూర్చి చెప్పు, హ్యూబర్టు' అన్నాడు
మిష్టర్ బ్లయిర్... 'చూపండి, హ్యూబర్టుకు మూడు హెచ్చ
రికలు వచ్చినవి. అబ్బాయిలూ మీలో ఎవ్వరికైనా ఎట్టి
హెచ్చరికలైనా వచ్చినవా?' అని ప్రశ్నించాడు బ్లయిర్.

'నాకు వచ్చింది. ఒక వారంరోజులక్రితం చిన్న కాగితం
మీద వ్రాసి వచ్చినది.' అన్నాడు బాసిల్ హఠాత్తుగా.

ఒక క్షణకాలం బాసిల్ వంక చూచాడు. బ్లయిర్
మనోవీధిలో ఒకవిధమైన అభిప్రాయం, అనుమానం అని
చెప్పుటకు వీలులేనట్టిది, తొణికిసలాడింది. కలతచెందినట్లుగా
తల ఊపాడు, తిరిగి హ్యూబర్టు యొక్క ధైర్యసాహసాలకు
స్థిరబుద్ధికి వానిదృష్టి మరలినది.

ఈలోగా, హ్యూబర్టు తనకు తెలిసిన సంగతులన్నీ
పూర్తిచేసి ఊహాగానంలో మునిగిపోయినాడు.

'ఆ హెచ్చరికలు పంపుతున్నది నీవే అనుకుంటాను పట్టుకుందామనుకున్నాను. పిశాచంవలె పరుగెత్తావు. బత్ నీవు చూచి వుండాల్సింది-నీతోబాటు సమానంగా పరుగెత్త గలడు.'

'అతను పెద్దవాడా?' ముక్కునుచీదుకుంటూ అడిగాడు బాసిల్.

'పెద్దవాడే-మా నాన్నంత వుంటాడు.'

'మిగతా వాళ్ళుకూడా పెద్దవాళ్ళేనా?'

"వాళ్ళుకూడా పెద్దగానే వున్నారు. వాళ్ళను చూచిన దాకా నేను ఆగలేదు. 'యిక్కడనుంచి వెళ్ళండి లేకపోతే మీ పని పడతాను' అని పెద్దగా అన్నాను. వాళ్ళు వెంటనే పరుగెత్తటం ప్రారంభించారు. ఒకరివెంట పడ్డాను. అయితే అందరూ వెళ్ళిపోయినారు."

'వాళ్ళు ఇటాలియనులని హ్యూబర్టు చెబుతాడు అనుకుంటారు' మిష్టరుబ్లయిర్ మధ్యలో అడిగాడు. 'హ్యూబర్టు! నీవు అలా అనుకోలేదా?' అని ప్రశ్నించాడు.

'వాళ్ళంతా తమషాగా వున్నారు. ఒక్కడు మాత్రం ఇటాలియన్‌గా వున్నాడు.' అన్నాడు హ్యూబర్టు.

యింతలోకే డైనింగుగదిలో రొట్టె, ద్రాక్షరసం తయారు జేసిపెట్టింది, మిసెస్సు బిస్సిల్. అందరిని డైనింగుగది లోనికి తీసికొని వెళ్ళినది. హ్యూబర్టుకు పక్కగా వున్న కుర్చీలో ఇమోజిన్ కూర్చున్నది.

'హ్యూబర్టు యిప్పుడు జరిగినదంతా చెప్పు' అన్నది.

మరల ఒకసారి కథంతా హ్యూబర్టు చెప్పాడు. ఆకుట్ర దారులలో ఒకరి మొలకు కట్టుకొన్న బెల్టునుంచి క త్తి పొడుచు కొని వచ్చినది. హ్యూబర్టు సంభాషణ విరివిగా దూకుడుగా సాగుతున్నది. హ్యూబర్టును మోసగించుటకు ప్రయత్నిస్తే ఏం జరుగుతుందో యింతకుముందుగానే చెప్పాడు. వారు కత్తులు తీయుటకు ప్రారంభించారు. కాని బాగా ఆలోచించిన మీదట పలాయనం చి త్తగించారు.

ఈకథ చెబుతున్న సందర్భంలో బల్లదించ తమాషాగా ఒక విపరీతమైన శబ్దంవినిపించింది. ఏమిటోనని ఇమోజిన్ చూచింది. కాడీకామ్ మీద పండ్లరసం పోసుకుంటున్నాడు బాసిల్. వానినేత్రాలు అమాయికంగావున్నవి. మరొకనిమిషంనడిచింది. మరలశబ్దం వినిపించినది. ఈసారి వానిముఖంలో ద్వేషం, ఈర్ష్యాభావములు స్పష్టంగా గోచరిస్తున్నాయి.

'బాసిల్, నీవు ఏమిచేసివుండేవాడివి? నీవుకూడా పరుగెత్తేవాడివనుకుంటాను.' అన్నది.

బాసిల్ కాఫీకేకును నోట్లో వేసికొని మింగుతున్నాడు. అదిచూచి బిల్ కాంపు, రిప్లిబక్ నర్ పరిహాసం చేస్తున్నారు. ఇమోజిన్ కు విసుగు పుట్టుచున్నది. హ్యూబర్టు గురుతు తెచ్చుకొని ఒకొక్కటే చెబుతుంటే, ఆమె ద్వేషంతో బాసిల్ వంక చూస్తున్నది. అంతకంతకు అతనిమీద ఈర్ష్య పెరిగి పోతున్నది.

వారంతాకలిసి గ్రంథాలయంలోనికి వెళ్ళారు. ఇమోజిన్ పియానోదగ్గర ఒంటరిగా కూర్చున్నది. పిల్లలంతా హ్యూబర్టు మంచంచుట్టూ చేరారు. అంతూ పొంతూ

లేకుండా హ్యూబర్ట కథ చెబుతుంటే వాళ్ళు నిశ్శబ్దంగా జాగ్రత్తగా వింటున్నారు. ఒక గంటగడిచిన తరువాత వారంతా వెళ్ళుటకు సిద్ధపడ్డారు. ఇమోజిన్ సంతోషపడ్డది.

'యిదంతా మొదటినుంచి చివరవరకు వింతగావున్నది. నాకు యిష్టంలేదు. రేపు యీ విషయాన్ని గూర్చి గూఢ చారిగా పరిశోధిస్తాను. వాళ్ళకు హ్యూబర్టనుంచి ఏమి కావాలి? హ్యూబర్టను ఏమి చెయ్యాలని అనుకుంటున్నారు?' అన్నాడు బ్లయిర్.

ఎవ్వరూ మాట్లాడలేదు. హ్యూబర్టు కూడా మౌనం గానే వున్నాడు.

'నాకేమీ బాగాలేదు. మిమ్ములనందరిని మా యిళ్ళ దగ్గర చూడాలనుకుంటున్నాను.' అన్నాడు బ్లయిర్.

ఈ ప్రయత్నం బాసిల్ కు కొంతభారము తగ్గినట్లుగానే తోచింది. హాల్లో మిష్టర్ బ్లయర్న్ని ఇమోజిన్ తల్లి సాగ నంపుతూ వానివద్ద శెలవు తీసికొనుచున్నది. ఈ అవకాశాన్ని తీసికొని ఇమోజన్, హ్యూబర్టను గ్రంథాలయంలోనికి రమ్మన మని చెప్పినది. వెంటనే యీ సంగతి బాసిల్ విన్నాడు. ఏదో గొణుగుకుంటూ, సణుగుతూ బాసిల్ వెళ్ళాడు. పన్నాగం బాగానే పన్నాడు. కాని తుదకు అదొక త్రుటిలో మటుమాయమైనది.

దిక్కులు చూచుకుంటూ అంతా కలిసి వెళ్ళిపోయి నారు.

♦ ♦ ♦ ♦

ఒక వారం గడచిన తరువాత, హ్యూబర్టు, వానితల్లి వేసవి మకాంకు సముద్రతీరానికి వెళ్ళారని, బాసిల్ మరియు రిప్లెయి విన్నారు. బాసిల్ విచారించాడు. హ్యూబర్టునుంచి ఎన్నో మంచిసంగతులను, రిప్లెయి నేర్చుకో దలచుకున్నాడు. తోటలో హ్యూబర్టు చేసినట్లుగానే బాసిల్ కూడా చెట్టుకు ఆనుకొని తలకు పక్కగా టోపీ పెట్టుకున్నా కొద్దిసేపు అనుసరించాడు. హ్యూబర్టు మాదిరిగా తనకు సాధ్యపడదని గ్రహించి మామూలు రూపులోనికి వచ్చాడు.

హ్యూబర్టు గేటుముందర ఒక క్షణకాలంపాటు ఆగి నైతికంగా ఆలోచించాడు. జీవితంలోవున్న మూలపదార్థాలను వేటితో మేళవింప జేసినా, శాస్త్రబద్ధంగా వుండాలని తెలుసుకున్నాడు. మరోవారం గడిచినతరువాత ఇమోజిన్‌ను పోగొట్టుకొన్నందుకు విచారంలేదని గ్రహించుకున్నాడు. ఆమెను కలుసుకున్నప్పుడు, తనకు అలవాటైన చిన్నపిల్లగానే భావించాడు. ఆ సాయంత్రం జరిగిన పరమానంద సంఘటన పక్వదశకు రానట్టిది. ఉద్రేకంతో కూడుకున్నట్టిది.

మిసెస్సు బ్లయిర్‌ను తాను భయపెట్టిన సంగతి వానికి తెలియదు. వానిమూలంగానే ప్రతిరాత్రి స్పెషల్ పోలీసు కావలాకాచాడు. అతనికి తెలిసినదల్లా అంతులేని అస్పష్టంగా వున్న విరామంలేని, వ్యాకులంగావున్న వసంతఋతువు మూడు నెలలు ఏదోవిధంగా తృప్తిని గల్గించినవి. ఆఖరివారంలో అవి మండినవి...ధగధగ లాడినవి-బద్దలయినవి - కాలిపోయినవి. వానికి విచారం లేదు. అంతులేని అవకాశాలున్న వేసవికాలం వైపుకు దృష్టి మరల్చాడు. ——

# పంచాయితీదార్లు

రచన :- సుసాన్ గ్లాస్పెల్

[సుసాన్ గ్లాస్పెల్ (1882-1948) అమెరికన్ లిటిల్ థియేటరుకు మాతృదేవి వంటిది. 1931 లో 'Alisan's House' అనే గొప్ప నాటకాన్ని రచించి పులిట్జర్ బహుమానమును పొందినది. చాలా మటుకు ఆమె జీవితాన్ని అంతా న్యూ ఇంగ్లాండులోనే గడిపింది. చిన్న తనంనుంచి రచనలు సాగించాలనే అభిలాష గలది. ఆమె కాలేజీలో చదువుకొనే రోజులలోనే పత్రికలకు కథానికలు పంపినది: డిగ్రీపొందిన తరువాత కొంతకాలంపాటు పత్రికా కార్యాలయంలో పనిచేసింది. తదుపరి ఆమె కాలాన్నంతా రచనలకే వినియోగించినది. ప్రముఖ అమెరికన్ పత్రికలు ఆమె కథానికలను ప్రచురించినవి.

జార్జి క్రాంమక్ ను వివాహం చేసుకొన్నది. భర్తకూడా పేరుపొందిన రచయిత: భార్యా భర్త లిద్దరూ కలసి న్యూ ఇంగ్లాండులో వుండి Province town Players ను స్థాపించుటలో నాయకత్వం వహించిరి. అచ్చటనుండే ఆమె అనేక నాటకాలు రచించి కీర్తి గడించినది. బహుమతి పొందిన Alison's House. నాటకంకూడా అచ్చట వున్నప్పుడు వ్రాసినదే. తరువాత భార్యా భర్త లిద్దరూ అనేక సంవత్సరాలు గ్రీసులో నివసించారు. భర్త చనిపోయిన తరువాత కరుణా రసపూరితమైన 'The Road to the Temple' అనే వారిజీవితగాథను వ్రాసెను.

'A jury of her Peers' అనే కథ ప్రఖ్యాతి చెందిన నీతిని బోధించే అనేక అమెరికన్ కథా గుచ్ఛములలో ప్రచురింప బడినది]

మార్తా హేల్ తలుపు తెరచింది. మంచువంటి ఈదరు గాలి ఉత్తరాన్నుండి వీచింది. వెంటనే ఉన్ని కంబళి తీసికొని తలకు చుట్టుకున్నది. వంటయింటిని పరకాయించినది. చిందర వందరగా వున్నది. సగం పిండి జల్లించి వున్నది. సగం యింకా జల్లించవలసి వున్నది. ఏదో అసాధారణమైన సంగతి జరిగి వుండబట్టే ఆమెకు పిలుపు వచ్చినది.

సగంపనిచేసి వెళ్ళటంఆమెకుయిష్టంలేదు. పట్టణంనుంచి మిష్టర్ హేల్‌ను కొనిపోవుటకు కొంతమంది వచ్చారు. షెరీఫ్ (ఒక అధికారి) పరుగెత్తుకుంటూవచ్చి మిసెస్సు హేల్‌ను కూడా తోడుగా తన భార్య రమ్మంటున్నదని చెప్పాడు. అన్ని పనులు వదిలివేసి మిసెస్సు హేల్ వెళ్ళక తప్పిందికాదు.

'మార్తా, నీకోసం చలిలో వాళ్ళంతా కనిపెటుకొని వున్నారు' అన్నాడు భర్త.

మరల తలుపు తెఱచినది. తనకోసం బండిలో ముగ్గురు పురుషులు, ఒక స్త్రీ వేచి వుండటం చూచి వెంటనే వారిని కలుసుకున్నది.

బండిఎక్కి చుట్టూ సర్దుకున్నతరువాత ఆ బండిలోని స్త్రీ వంక చూచింది. ఒక సంవత్సరం క్రితం సంతలో మిసెస్సు పీటర్సును కలుసుకున్నది. ఆమె షేరీఫ్ భార్యగా వుండుటకు తగిన హుందాతనంలేదు. పొట్టిగాను, సన్నగానువున్నది. కంఠ స్వరం హీనంగా వున్నది. మిష్టరు పీటర్ లావుపాటి మనిషి.

పెద్దగొంతు. వానిని షెరీఫ్‌గా ఎన్నుకున్నారు. అతడు న్యాయ శాస్త్ర సమ్మతంగా వుండేవార్ని గౌరవిస్తాడు. దొంగలెవ్వరో, చోరలెవ్వరో తనకు తెలిసినట్లుగా నటిస్తాడు. అందరితోను సరదాగాను ముచ్చటగాను మాట్లాడుతున్నాడు. ఇప్పుడు రైట్సుకు షెరీఫ్‌గా వెళ్ళుతున్నాడని మిసెస్సు హేల్ ఊహించినది.

'ఈ సంవత్సరం మనవూరు అంతబాగాలేదు' అన్నది. మిసెస్సు పీటర్సు ధైర్యంతో. పురుషులంతా మాట్లాడు తూంటే, స్త్రీలుకూడా మాట్లాడుకోవాలనే ధోరణిలో మాట్లాడినది.

మిసెస్సు హేల్ సమాధానం యింకా పూర్తికాలేదు. వారనుకున్న గమ్యస్థానాన్ని సమీపిస్తున్నారు. అది చూచు టకు ఏకాంతంగా వున్నది. అది లోయలోవున్నది. చుట్టూ బూరుగు వృక్షాలున్నవి. పురుషులంతా ఆ ప్రదేశాన్ని చూస్తూ జరిగిన విషయాన్నిగూర్చి మాట్లాడుకుంటున్నారు. జిల్లా వకీలు బండిలో ఒక పక్కకు వంగి నిలకడగా చూస్తు న్నాడు. అసలుచోటుకు చేరారు.

'మీరు నాతో వచ్చినందుకు సంతోషంగా వున్నది' అన్నది పీటర్సు. పురుషులంతా వంటయింటిలోనికి వెళ్తున్నారు. మిసెస్సు పీటర్సు తలుపువద్దకు రాగానే ఆమె గడపదాటలేదని మిసెస్సు హేల్ అనుకున్నది. కారణం ఏమిటంటే యిట్టి అనుభవంఇంతకుముందు ఆమెకువుండివుండదు. మిన్నీఫాష్టరు'ను చూడాలని ఆదుర్దాగా వున్నది. యిరువది సంవత్సరాలనుంచీ

ఆమె మిసెస్సు రైటుగా మారిపోతే, యింకా మిస్ఫ్రాస్టు గానే భావిస్తున్నది.



పురుషులు కుంపటిదగ్గరకు వెళ్ళారు. స్త్రీలు యిద్దరూ తలుపుదగ్గరే నిలబడ్డారు. ఆ జిల్లావకీలు పేరు హెన్‌డర్‌సన్. 'నిప్పుదగ్గరకు రాండి' అన్నాడు. ఒకఅడుగు ముందుకువేసి మిసెస్సు పీటర్సు ఆగింది. 'నాకు చలిగా లేదు.' అన్నది. ఆ యిద్దరు స్త్రీలు మరల తలుపువద్దనే నిలబడ్డారు.

పురుషులంతా ఒక్కనిమిషంసేపు మాట్లాడుకున్నారు. అంతకు ముందే మిష్టరు పీటర్సు తన డిప్యూటీని పంపి అక్కడ అన్నిఏర్పాట్లుచేశాడు. మిష్టరు పీటర్సును యిప్పుడు షెరీఫ్ పీటర్సు అంటారు. షెరీఫ్ కోటు తీసివేశాడు. బల్లమీద చేతులుపెట్టి అధికారరీత్యా వ్యవహారం విచారణసాగించాడు. 'మిష్టరు హేల్, మనం మాట్లాడే ముందు నిన్న ఉదయం నీవు యిచ్చటకువచ్చినప్పుడు ఏమి చూచావో వకీలుకు చెప్పు.' అన్నాడు.

ఆ జిల్లా వకీలు వంటయింటిని చూస్తున్నాడు. 'అది సరే గాని, అన్నీ నిన్నటివలెవున్నావా?' షెరీఫ్ వంకచూచి అడిగాడు. 'అలాగే వున్నవి.'

'నిన్న ఎవ్వరో యిక్కడ వదలి వుంటారు.'

'ఓ – నిన్న – ఆ పిచ్చిదానికోసం మారిన్ సెంటరుకు ప్రాంకును పంపినప్పుడు నాచేతినిండా డబ్బువున్నది. ఈరోజుకు నీవు తిరిగి రాగలవని నాకు తెలుసు.'

'మిష్టరు హేల్, నిన్న ఉదయం నీవు యిక్కడకు వచ్చినప్పుడు ఏమి జరిగిందో చెప్పు.' అన్నాడు వకీలు.

మిసెస్సు హేల్ తలుపును ఆనుకొనివున్నది. వున్నది వున్నట్లుగానే చెబుతాడని ఆశించినది. అనవసరసంగతులు చెప్పి మిస్సీ ఫాష్టరుకు కష్టం కల్గించడని భావించినది. మిష్టరు హేల్ వెంటనే ప్రారంభించలేదు.

'మిష్టరు హేల్' అని గుర్తుచేశాడు వకీలు.

'ఒక బుట్ట బంగాళాదుంపలు తీసికొని నేను, హారీ, పట్టణానికి బయలుదేరాను.

'హారీ, మిసెస్సు హేల్‌కు తెలిసిన పిల్లవాడే. వాటిని నిన్న పట్టణానికి తీసికొని వెళ్ళలేదు. యీ వుదయం తీసికొని పోవుచున్నాడు. అందుకని అతడు యింటికి రాలేదు. జరిగిన కథ అంతా వకీలుకు చెప్పమని " షెరీఫ్ మధ్యలో మరల చెప్పాడు. మిసెస్సు హేల్‌కు భయభ్రాంతులు కల్గినవి. 'మేము యీ రోడ్డునే వచ్చాం' అని చెప్పుకుపోతున్నాడు హేల్. యిల్లు కనపడేటప్పటికి, టెలిఫోను కొనమని జాన్ రైటును అడుగుతానని హారీకి చెప్పాను. యిదివరలో యీ సంగతి రైటుకు చెప్పాను. అతడు అంతగా పట్టించుకోలేదు: స్త్రీలకు టెలిఫోను అంటే యిష్టంగనుక వానిభార్యను అడుగుదామను కున్నాను. ఇట్టి మారుమూలసందులో టెలిఫోను వుండటం మంచిదనుకున్నాను...'

'అనవసర సంగతులు చెబుతున్నాడు.' మిసెస్సు హేల్ భర్త దృష్టిని ఆకర్షించాలని చూచింది. కాని వకీలు అడ్డువచ్చాడు.

'దానిసంగతి తరువాత మాట్లాడుకుందాం. నాకుకూడా మాట్లాడాలని వున్నది. నిన్న నీవు యిక్కడకు వచ్చినపుడు ఏమిజరిగిందో చెప్పు?' అన్నాడు వకీలు.

ఈసారి యోచనగాను, జాగ్రత్తగాను చెప్పటం ప్రారంభించాడు.

'నేనేమీ చూడలేదు - వినలేదు - తలుపు తట్టాను - లోపల నిశ్శబ్దంగా వున్నట్లు తోచింది. అప్పటికి ఎనిమిదిగంటలు దాటింది. మరల గట్టిగా తలుపు కొట్టాను. 'లోనికి రా' అన్నట్లుగా తోచింది - యీ తలుపును - నేనే తెరచాను. అక్కడవున్న కుర్చీలో మిసెస్సు రైటు కూర్చునివున్నది.

అందరూ వంటయింటిలోని కుర్చీవంక చూచారు. ఆ కుర్చీ పాతబడ్డది. ఎఱ్ఱరంగు పాలిపోయినది. కొయ్య రిమ్ము లలో ఒకటి విరిగిపోయినది. ఒకవేపుకు వరగబడి వున్నది.

'ఆమె ఏ విధంగా వున్నది?' వకీలు ప్రశ్నించాడు.

'ఆమె విచిత్రంగా వున్నది!'

'విచిత్రం అంటే అర్థం ఏమిటి?'

జేబులోనుంచి వకీలు ఒక పెన్సిలు పాకెట్టు పుస్తకం తీశాడు. పెన్సిలు తీయటం మిసెస్సు హేల్‌కు యిష్టంలేదు. అనవసర విషయాలు చెప్పవద్దన్నట్లుగా ఆమె భర్తవంక చూస్తున్నది. వకీలు చెప్పే సంగతులు పుస్తకంలో వ్రాసుకొని క్లిష్టపరిస్థితులు తెచ్చిపెట్టుతాడని ఆమె భయం.

'తరువాత ఏమిచెయ్యాలో ఆమెకే తెలియలేదు.' అన్నాడు హేల్.

'నీవు వచ్చినందువల్ల ఆమె ఏమి అనుకున్నది?'

"ఏమీ అనుకోలేదు. 'చలిగావున్నది. మిసెస్సు రైటు అని నే మాత్రం చెప్పాను. 'అట్లాగా' అని ఆమె అన్నది. నాకే ఆశ్చర్యం వేసింది. నన్ను కూర్చోమనికూడా చెప్ప లేదు. నావంక చూడకుండానే ఆమె కూర్చున్నది. జాన్‌ను చూడాలని ఆమెకు చెప్పాను. ఆమె నవ్వింది – మీరుకూడా నవ్వుగానే భావిస్తారనుకుంటాను. ఈలోగా బయటవున్న హారీ గుర్తుకొచ్చాడు. 'నేను జానును చూడవచ్చునా?' అని గట్టిగా అడిగాను. 'లేదు, యింట్లోలేదు.' అన్నది. నావంక చూచి, 'ఔను, యింట్లోనే వున్నాడు.' అన్నది. 'అయితే నేనెందుకు చూడకూడదు?' అని అన్నాను."

'చనిపోయినాడు.' అన్నది. చినిగిన గుడ్డలు కుట్టు కుంటున్నది.

'చనిపోయినాడా?' అని విభ్రాంతిగా అడిగాను.

'ఔనన్నట్లుగా తల ఊపింది. ఏమాత్రం ఆవేశం, ఆదుర్దా ఆమెలో కాన్పించలేదు.'

'నాకేమీ తెలియక, ఎందుకు? ఎక్కడ వున్నాడు?' అని ప్రశ్నించాను.

'మేడపైకి చూపింది. పై గదిని చూపించుతూ – యీవిధంగా' అన్నది.

'పైకి వెళ్ళాలనుకున్నాను. నాకేమీ తోచలేదు. వచార్లు చేశాను. దేనివల్ల చనిపోయినాడు?' అని మరల ప్రశ్నించాను.

'మెడకు ఉరితగిలించుకొని చనిపోయినాడు' అని చెప్పింది.'

హేల్ మాట్లాడటం మానివేశాడు. ఆ కుర్చీవంక యింకనూ ఆమె అందులో వున్నదన్నట్లుగా తదేక దృష్టితో చూస్తున్నాడు. ఎవ్వరూ మాట్లాడలేదు. ప్రతివారు అలాగే చూస్తున్నారు."

'అయితే అప్పుడు నీవు ఏం జేశావు?' వకీలు ప్రశ్నించాడు.

'బయటకు వెళ్ళి హారీని పిల్చాను. నాకేదో సహాయం కావాలని భావించాను. హారీని తీసికొని మేడమీదకు వెళ్ళాం. అక్కడ అతడు పడి...'

'సరె, తరువాత ఏం జరిగిందో చెప్పు?'

'టాప్ తీసివేయాలనే ఆలోచన కల్గింది. అయితే హారీవెళ్ళి చనిపోయినాడని చెప్పాడు. తిరిగి క్రిందకు దిగి వచ్చాం.'

'ఆమె అలాగే కూర్చుని వున్నది. ఈ సంగతి ఎవ్వరికైనా చెప్పారా?' అని అడిగాను.

'ఏమీా సంబంధం లేనట్టుగా లేదు' అని జవాబు చెప్పినది.

'యిది ఎవ్వరుచేసి వుంటారు? మిసెస్సు రైటు?' అని హారీ అడిగాడు.

'నాకు తెలియదు.' అని సమాధానము చెప్పింది.

'నీకు తెలియదా?' అని హారీ అడిగాడు.

'జవాబు లేదు.'

'వాడి సంగతి నీకు తెలియదా?'

'ఔను. నేను లోపలే వున్నాను.'

'ఎవ్వరో మెడకు తాడువేసి చంపి వుంటారు. నీకు తెలియదు?' అన్నాడు హారీ.

'నేను నిద్దుర లేవలేదు.' అన్నది ఆమె. ఒక నిమిషం గడిచిన తరువాత, నేను గాఢ నిద్దురపోయాను.' అన్నదామె.

'యింకా ప్రశ్న లడుగుటకు హారీ ప్రయత్నించాడు. నేనే నివారించాను. ఆమె న్యాయాధిపతికి చెప్పుకుంటుంది. వెంటనే హారీ టెలిఫోను చేయుటకు వెళ్ళాడు."

'పీరార్ వెళ్ళారని తెలియగానే ఆమె ఏమి చేసింది?' వకీలు ప్రశ్నించాడు. పెన్సిలుతో వ్రాసుకొనుటకు సిద్ధంగా వున్నాడు.

'ఆ కుర్చీలోనుంచి లేచి, చిన్న కుర్చీలో కూర్చున్నది. చేతులు ముడుచుకొని క్రింద చూస్తూకూర్చున్నది. ఆమెతో సంభాషణ చెయ్యాలనుకున్నాను. టెలిఫోను సంగతి చెప్పాను. ఆమె నవ్వుకొని విచిత్రచూపులు చూచించి.

పెన్సిలు శబ్దం విని కథ చెబుతున్న హేల్ తలపైకెత్తి చూచాడు.

'విచిత్రగా అని వ్రాసుకోకండి—అలా వుండదు. వెంటనే హారీ వచ్చాడు. తరువాత డాక్టర్ లూయడ్, పీరార్ పీటర్సు వచ్చారు యింతే అనుకుంటాను నాకు తెల్సింది.'

*　　*　　*

'అందరం కలిసి మేడపైకి వెళ్ళుదాం. తరువాత చుట్టూ చూద్దాం.' అన్నాడు వకీలు. వంట యిల్లంతా కలియ చూశాడు.

'యిక్కడ ఏమంత ముఖ్యమైనదని లేదని మీరు నమ్మరనుకుంటాను. ఏమీ అవకాశం లేదు.' అన్నాడు వకీలు షేరీఫ్‌తో.

'వంటయింట్లో చిన్న చిన్న సామానులుతప్ప ఇంకేమీ లేవు' చిరునవ్వుతో అన్నాడు షెరీఫ్.

వకీలు బీరువావంక చూచాడు. అది సగంవరకు బీరువా వలె వున్నది. మిగతా సగం మూత వేసి వున్నది. విచిత్రంగా వున్నది. గోడలో అమర్చబడినది. కుర్చీయెక్కి పైభాగపు మూత తీశాడు. లోపలకు చేతినిపోనిచ్చి చూచాడు. అంతా జిగురు జిగురు జిగురుగా వున్నది.

'ఇక్కడ మంచి ఫలహారం' అన్నాడు.

స్త్రీలిద్దరూ దగ్గరకు వెళ్ళారు.

'ఓ, ఆమె పండు' అంటూ షెరీఫ్ భార్య అన్నది.

వకీలువంకచూచి దాన్ని గురించి విచారించినది.

'గతరాత్రి ఆ కటికచలికి బిగుసుకుపోవుటవలన ఆమెకు వ్యసనంగా వున్నది.'

ఆమె భర్త నవ్వాడు.

'ఖూనీచేసినందుకు, దాచిపెట్టిన వస్తువులనుగూర్చి వ్యధ పడుతున్నందుకు స్త్రీలను శిక్షించగలరా ?'

వకీలు పెదవులు ముడుచుకున్నాడు.

'దాచిపెట్టిన వస్తువుల వ్యసనంకన్నా మరొకదాన్ని గూర్చి ఆమె బాధపడవచ్చు' అన్నాడు.

'స్త్రీలు మామూలుగా స్వల్పవిషయాలను గూర్చి వ్యసనపడుతూవుంటారు' అన్నాడు హేల్.

ఆ యిద్దరుస్త్రీలు దగ్గరగా వచ్చారు. ఎవ్వరూ మాటాడలేదు.

'స్త్రీలకు ఎంత వ్యాకులత, విచారంవున్నా స్త్రీలు లేకుండా మనం ఏంచేయగలం ?' అన్నాడు వకీలు.

స్త్రీలు మాటాడలేదు. అంగీకారం చూపలేదు. వకీలు బావిదగ్గరకువెళ్ళి చేతులు కడుక్కున్నాడు. తువాలుతో చేతులు తుడుచుకొని ఆరవేశాడు.

'మురికి తువాలాలు. ఇంట్లోవారికి జాగ్రత్త లేదు. ఏమంటారు ?' అని స్త్రీలను ప్రశ్నించాడు. బావిదగ్గర మురికి కుండలన్నీ కాలితో నెట్టాడు.

'సాగుచేయబడు భూమిలో చాలా పనిచేయవలసి వుంటుంది' అన్నది మిసెస్సు హేల్.

'నిజమే, డిక్సన్ కంట్రీఫారం యిళ్ళు కొన్ని నాకు తెలుసు. వాళ్ళ యిళ్ళలలో మురికి తువాలాలు వుండవు' అన్నాడు.

తువాలాలు తొందరగా మురికిపట్టుతవి. పురుషుల చేతులు శుభ్రంగా వుండవు'

అవును. అయితే మీరు,మిసెస్సురైటు యింటిపొరుగున వుండేవారట. స్నేహితులు అనికూడా విన్నాను' అన్నాడు వకీలు.

అంగీకారసూచకంగా మిసెస్సు హేల్ తల ఊపింది.

'యీ యింట్లో వుండలేదు. తుదిసంవత్సరాలలో ఆమెను బాగా ఎరుగుదును. యిది సంవత్సరం క్రితంమాట.'

'ఎందుకని? ఆమె అంటే మీకిష్టంలేదా?'

'ఆమెను బాగా ప్రేమించేదాన్ని. రైతుల భార్యల చేతులు నిండుగా వుంటాయి.' అంటూ వంటయిల్లంతా పరికించింది.

'తరువాత.'

'ఆ చోటు అంత బాగావున్నట్లుగా లేదు' అని తనలో తాను చెప్తున్నట్లుగా అన్నది.

'బాగావున్నదని ఎవ్వరూ చెప్పరు. యింటిసంగతి పట్టించుకున్నట్లుగా లేదు.'

'మిష్టరు రైటుకూడా అంతే అనుకుంటాను. జాన్ రైటుకు కూడా బాగా వుండివుండదనుకుంటాను.'

'ఈసంగతి తరువాత మాట్లాడుతాను. యిప్పుడు మేడ పైనవున్న విషయాన్నిగూర్చి ఆదుర్దాగా వున్నది.' అన్నాడు. వకీలు.

పురుషులంతా మేడమెట్లు దగ్గరకు వచ్చారు.

'మిసెస్సు పీటర్సు చేసేదంతా బాగా వుంటుందను కుంటాను. నిన్న తొందరగా వచ్చాం. ఆమె కొన్ని గుడ్డలు, వస్తువులు తెచ్చుకోవాల్సింది.' అన్నాడు షెరీఫ్.

ఆ యిద్దరి స్త్రీలను వంటయింటిలో వదిలిపోతూ, 'మిసెస్సు పీటర్సు మనకు పనికివచ్చేది ఏదైనా కనిపెట్టిచూడు. ఆచూకీ దీయుటలో స్త్రీలు సులభంగా కనిపెట్టగలరు. యిప్పుడు మాకు కావాల్సింది అదే!' అన్నాడు వకీలు.

'స్త్రీలకు తెలియగలదంటారా?' అంటూ మిష్టరు హేల్ అనుసరించాడు.



చలనంలేకుండా, నిశ్శబ్దంగా ఆ యిద్దరి స్త్రీలు మెట్ల మీద పాదాలచప్పుడు, గదిలో పాదాలధ్వని వింటూ నిల్చున్నారు. 'నా వంటయింటిలోనికి పురుషులువస్తే నాకు అసహ్యంగా వుంటుంది.' అన్నది మిసెస్సు హేల్.

'అది పురుషులవిధి' అన్నది షెరీఫ్ భార్య పిరికితనంగా.

'పనిచేయవలసినదే.'

మిసెస్సు హేల్ వంటయిల్లంతా చూచింది. అంతా చిందరవందరగా వున్నది. క్రిందవ బొక్కెననిండా పంచదార పోసివున్నది. దానిపక్కనే పేపరు సంచి ఒకటి వున్నది. సగం నిండుగా వున్నది. దానిదగ్గరకు వెళ్ళినది. 'ఆమె యిక్కడ పెట్టుతున్నది కామోసు' అని తనలో తాను అనుకున్నది.

ఆమె వంటయింటిసంగతి గుర్తుకు వచ్చింది. సగం పిండి జల్లించి, సగం అలాగేవుంచి యిచ్చుటకు వచ్చినది. మిన్నీ ఫాస్టరుకు ఏమి ఆటంకం వచ్చినది ? సగంవరకే ఆపని ఎందుకు చేసింది ? ఆ పని పూర్తిచేయుటకు వెళ్ళినది. పనులు సక్రమంగా లేకపోతే ఆమెకు చికాకుగా వుంటుంది. మిసెస్సు పీటర్సు ఆమెను కాపలాకాస్తున్నది. మరొక విధంగా అనుకుంటుందేమోనని, 'ఆమె పండుసంగతి చూస్తే నామోషిగా వున్నది' అంటూ బీరువా వద్దకువెళ్ళి, కుర్చీఎక్కి, 'అంతా పోయినదనుకుంటాను' అన్నది.

'యింకో మంచి పండువున్నది. దాన్ని దీపం దగ్గరపెట్టి చూచింది. అదీ ఎట్టినిపండే – అదొక్కటేనని నా నమ్మకం' అన్నది.

కుర్చీదిగి బావివద్దకు వెళ్ళి సీసాను శుభ్రంగా కడిగింది. బల్లమీద పెట్టింది. కుర్చీలో కూర్చుందా మని వెళ్ళింది. అయితే కూర్చోలేదు. ఏదో ఆమెను కూర్చోనీయలేదు. వెనక్కు తిరిగి చూచింది. చూస్తూ నిలబడ్డది. షెరీఫ్ భార్య కంఠస్వరం విన్నది. 'ఆ వస్తువులన్నీ ముందరగది అరలోనుంచి తెస్తాను.' అంటూ గదితలుపు తెరచింది. లోనికివెళ్ళి వెనక్కు తిరిగింది. 'నాతోకూడా వస్తున్నావా, మిసెస్సు హేల్ ?'— 'నీవు నాకు సహాయపడు' అన్నది. ఆ గదంతా చల్లగావున్నది. అందులోనికి వెళ్ళుట మంచిదికాదని వెంటనే వచ్చారు.

'నేను' అంటూ మిసెస్సు పీటర్సు వస్తువులన్నీ బల్ల మీద పెట్టి నిప్పుల కుంపటి దగ్గరకు వసుగ్తింది. గుడ్డలన్నీ తనిఖీచేస్తూ మిసెస్సు హేల్ నిలబడ్డది. మురికిగావున్న జాకెట్టుతీసికొని, 'రైటు దగ్గరలోనే వున్నది' అన్నది. ఆ జాకెట్టుకు గుస్తులు వున్నవి. 'మురికిగావుంటే మనకు హాయిగా వుండదు. మిన్నీ ఫాస్టరుగా వున్నప్పుడు మంచిమంచి దుస్తులు ధరించేది — యిదంతా యిరువది సంవత్సరాల క్రితం మాట.' అనుకొన్నది.

జాగ్రత్తగా ఆ గుడ్డలన్నీ మడతపెట్టి పొందుగా బల్ల మీద అమర్చినది. మిసెస్సు పీటర్సువంక చూచినది. ఆమె చూపులో కోపంతెప్పించే ఆతృతవున్నది. 'ఆమె శ్రద్ధ వహించదు.' తనలో తాను అనుకున్నది.

'మిన్నీఫాస్టరు చిన్నపిల్లగా వున్నప్పుడు మంచిగుడ్డలు వుండేవేనా ?'

ఆ గుడ్డను మరల చూచింది. నిర్ణయించులేకపోయింది. 'యిదంతా లోనికి తీసికొని వెళ్ళాలా?' మిసెస్సు హేల్ అడిగింది.

'లేదు.'

మేడ మెట్లవెనుకాల తలుపుదగ్గర వున్న ఒక శాల్వ తీసికొన్నది. హఠాత్తుగా మిసెస్సు హేల్ ఆమెదగ్గరకు వచ్చినది.

'మిసెస్సు పీటర్సు!'

'ఏమిటి హేల్?'

'ఆమె చేసికుంటుందని అనుకుంటున్నావా? మిసెస్సు పీటర్సు నేత్రాలు భయంకరంగా వున్నాయి.

'నాకు తెలియదు.'

'ఆమె చేసివుండదను కుంటాను.' గట్టిగా అన్నది హేల్.

'పైగదిలో అడుగుల చప్పుడు వినిపించు చున్నది. 'యిదంతా ఆమెకు తగదు. మిష్టరు హెన్‌డర్‌సన్ ఎత్తిపొడుపుగా మాట్లాడుతాడు.' అన్నది పీటర్సు.

మిసెస్సు హేల్ ఒక క్షణంవరకు జవాబు చెప్పలేదు. 'జాన్ లేవలేదు. నిద్దురపోతుంటే మెడక్రింద త్రాడు' అన్నది.

'వింతగావున్నది. మనిషిని చంపుటకు అదొక విచిత్రం.' అనుకున్నాడు.

'ఆసంగతే హేల్ చెప్పాడు. యింటిలో తుపాకీ వున్నది. దానిసంగతి అర్థంకాలేద'ని హేల్ అంటాడు.

'అదే యీ కేసుకు మూలం – హఠాత్తుగా వచ్చిన కోపమో – ఉద్రేకమో' వకీలు వస్తూ అన్నాడు.

'కోపాన్ని తెప్పించే వస్తువులు యిక్కడలేవు.' అన్నది మిసెస్సు హేల్. ఆమె మనస్సుకు ఏదో ఆలోచన తట్టింది. వంటయింటిలో బల్లమీద వున్న తువాలా ఆమె దృష్టిని ఆకర్షించినది. నెమ్మదిగా ఆ టేబులువద్దకు వెళ్ళినది. సగం శుభ్రంగా తుడిచివున్నది. మిగతా సగం తారుమారుగా వున్నది. అప్రయత్నంగా పంచదారతో నిండిన బొక్కెనవంక, కాగితపు సంచివంక చూచింది. ఏదో చెయ్యాలని అనుకున్నది. కాని పూర్తిచేయలేదు.

ఒక క్షణం అయిన తరువాత ఆమె తిరిగి వచ్చినది.

మేడపైన వస్తువులు వాళ్ళు ఎలా తెలుసుకుంటున్నారో ఆశ్చర్యంగా వున్నది. ఆమె పట్టణంలో వుండిపోయింది. యిప్పుడు ఆమె యిల్లే ఆమెకు ముప్పు తెచ్చేటట్లుగా వున్నది.' అన్నది హేల్.

'మిసెస్సు హేల్, న్యాయం, న్యాయంగానే జరుగుతుంది. న్యాయశాస్త్రం, న్యాయశాస్త్రమేగదా!' అన్నది పీటర్సు.

'ఔను'

మిసెస్సు హేల్ కుంపటి దగ్గరకు వెళ్ళినది. ఏదో మాటాడుకుంటూ ఒక నిమిషం కుంపటిని విసిరింది. కోపం వచ్చి లేచి నిలబడి గట్టిగా మాటాడినది.

'న్యాయశాస్త్రం, న్యాయశాస్త్రమే–పాడు కుంపటి పాడుకుంపటే–దీనిమీద వంట చేస్తావా? కుంపటి మూత తీసి

పడి. తన అభిప్రాయాన్ని చెప్పటం ప్రారంభించినది. ఆమె మనస్సు ఆలోచనలతో మునిగిపోయింది. మిస్టీ పాష్టరు యీ కుంపటితో ఎలా చేసేదో-మిస్టీ పాష్టరును యింతవరకు చూడలేదు' కదా-అన్నది.

'నిరుత్సాహపడి హృదయాన్ని పోగొట్టుకుంటారు.' అన్నది పీటర్సు. ఆమాటలు హేల్‌కు భయంగా వున్నాయి.

షెరీఫ్ భార్య కుంపటి వంక, భావి వంక, నీరు తెచ్చే కడమువంక చూచినది. ఆ యిద్దరు స్త్రీలు నిశ్శబ్దంగా నిలబడ్డారు. పైన పురుషుల అడుగుల శబ్దం వినపడుతున్నది. ఈ వంట యింటిలో పనిచేసినస్త్రీకి వ్యతిరేకంగా సాక్ష్యం ఏదైనా దొరుకుతుం దేమోనని గాలిస్తున్నారు.

'నీ దుస్తులు వదులు చేసికో. మనం బయటకు వెళ్ళినప్పుడు బాధగా వుంటుంది.' అన్నది హేల్.

మెడకు ధరించిన గుడ్డను ఆరవేయుటకు మిసెస్సు పీటర్సు గది వెనుక భాగమునకు వెళ్ళినది. ఒక క్షణం గడిచిన తరువాత, 'ఆమె బొంత కుట్టుచున్నది' అంటూ ఒక బుట్టెడు బొంత పీలికలను ఎత్తిపట్టుకున్నది.

మిసెస్సు హేల్ కొన్నిటిని బల్ల మీదపర్చింది. వాటిని సమానంగాపెట్టి-'ఇవి అందంగా లేవూ ?' అని ప్రశ్నించింది. ఆ యిద్దరు స్త్రీలు ఆ బొంతలో నిమగ్నులయి వుంటాన మేడ పైన వారి అడుగులధ్వని వినిపించటంలేదు. మెట్లగది తలుపు తెరుస్తున్నప్పుడు మిసెస్సు హేల్ అంటున్నది.

'ఆమె కుట్టుతున్నదనుకున్నావా, లేక ముడిపెట్టు తున్నదనుకుంటున్నావా లేక ముడిపెట్టుతున్నదా ?' షెరీఫ్ ఇంతలో వచ్చాడు ఏమీ బాధపడలేదు.

'ధాన్యపుకొట్టు దగ్గరకువెళ్ళి చూద్దాం' అన్నాడు వకీలు.

'విచిత్రం - ఏమీ వుండదు. చిన్నవిషయాలతో కాలయాపన చేస్తున్నాం. ఇక్కడ విచిత్రంగా వుండేది నాకేమీ కన్పించటంలేదు' అన్నది హేల్.

'వాళ్ళ మనస్సులలో అతిముఖ్యమైన విషయాలు వుండ వచ్చును' అన్నది పీటర్సు.

మరల ఆ బొంతను తనిఖీచేయుటకు వచ్చారు. అది అందంగా కుట్టబడి వున్నది. అదికుట్టిన స్త్రీనిగూర్చి ఆలోచిస్తున్నది హెల్.

'ఇటుచూడు' అన్నది షేరీఫ్ భార్య.

అది తీసికొని ఆమెకు చూపుటకు వెనక్కు తిరిగింది.

'కుట్టుపని - మిగతాదంతా అందంగా వున్నది - యిది ఏమిటోగావున్నది' అన్నది పీటర్సు.

ఇద్దరుస్త్రీలు ఒకరి నొకరు చూచుకున్నారు. ఏదో ఒక మెరపు యిద్దరిమధ్యా మెరిసింది. బలవంతంగా వెళ్ళి నట్లుగా విడిపోయినారు. మిసెస్సుహేల్ అక్కడే కూర్చున్నది. ఆ బొంతలోని ముడి పట్టుకుని దారాలు తీసింది.

'ఏంచేస్తున్నావు మిసెస్సుహేల్?' అన్నది పీటర్సు.

'కుట్టు సరిలేకపోతే సరిచేస్తున్నాను'

'మనం వస్తువులను తాకరాదనుకుంటాను'

'ఈపని కాస్తా యిప్పుడే పూర్తిచేస్తాను'

'మిసెస్సు హేల్ సూదితో కుట్టుచున్నది. మిసెస్సు హేల్ అనేమాట విన్నది.

ఏమిటి మిసెస్సు పీటర్సు ?'

'ఆమె అంత కోపంగా వుండుటకు కారణం ఏమిటి?'

'నాకు తెలియదు - నాకు తెలియదు. ఆమె బలహీనంగా వుంటుందని - నాకు అలసటగా వున్నప్పుడు విచిత్రంగా కుట్టుతాను' అన్నది హేల్.

'ఆ గుడ్డలన్నీ చుట్ట చుడుతాను - అవుసరంగా కావాల్సి వస్తాయి - తాడు కాగితం ఎక్కడ దొరుకతవి ?' అన్నది షెరీఫ్ భార్య.

'ఆ బీరువాలో వుండొచ్చు!' చుట్టూ చూస్తూ అన్నది మిసెస్సు హేల్.



ఒకబొంతను చక్కగా కుట్టి మిగతా వాటితో పోల్చి చూచింది. వ్యత్యాసం పోలికలేకుండా వున్నది. మిసెస్సు పీటర్సు పిల్చినది.

'యిక్కడ పిట్టల పంజరం వున్నది. ఆమెకు పిట్టకూడా వున్నదా, మిసెస్సు హేల్?'

'ఆమెకు వున్నదో లేదో నాకు తెలియదు. యిక్కడకు వచ్చి నేను చాలా కాలమైనది. నిరుడు ఒకడు పాటలు పాడే పక్షులను చౌకగా అమ్మేవాడు. ఆమె ఒకటి ఏదైనా కొన్నదేమో నాకు తెలియదు. బహుశా కొంతే కొని వుండవచ్చు. ఆమె చక్కగా పాడగలదు కూడాను.'

మిసెస్సు పీటర్సు వంటయిల్లంతా మరలచూచింది. 'యిక్కడ పక్షివుండటం విచిత్రంగానే వున్నది. ఆమెకు తప్ప కుండా ఒకటి వుండి వుంటుంది. లేకపోతే పంజరంతో ఏమి అవుసరం? పిట్ట ఏమయినదో!'

'పిల్లి తినివుంటుంది:' అన్నది హేల్.

'లేదు, ఆమెకు పిల్లి లేదు. కొంతమందికి పిల్లి అంటే భయం. ఆమెకుకూడా భయమేమో? నిన్న ఆమెను మా యింటికి తెచ్చినప్పుడు మా పెంపుడుపిల్లి గదిలోనికి వచ్చినది. ఆమె అమితంగా భయపడింది. పిల్లిని పంపివేశినదాకా వూరు కోలేదు.'

'నా చెల్లెలు బిగ్సీకూడా అంతే' అంటూ మిసెస్సు హేల్ నవ్వింది.

షెరీఫ్ భార్య జవాబు చెప్పలేదు. మిసెస్సు పీటర్సు ఆ పంజరాన్ని తనిఖీ చేయుచున్నది. 'ఈ తలుపువంక చూడు- పగిలిపోయినది' అంటూ హేల్ దగ్గరకు వచ్చినది.

'ఎవ్వరో పాడుజేసి వుంటారు.' అన్నది హేల్. మరల వారు ఒకరి నొకరు చూచుకున్నారు. ఆ చూపు భయంక రంగా, ప్రశ్నార్థకంగా, భీతిగా వున్నది. ఒకక్షణం ఎవ్వరూ మాట్లాడలేదు. కదలలేదు. మిసెస్సు హేల్ వెళ్ళుతూ, 'వారి కేదైనా సాక్ష్యం దొరికినట్లయితే, దీన్నిబట్టే ఆలోచిస్తా రను కుంటాను. ఈచోటు నాకు బాగాలేదు.' అన్నది.

'నాకు తోడుగా వచ్చినందుకు అమిత సంతోషంగా వున్నది, మిసెస్సు హేల్.' అంటూ ఆ పంజరం బల్లమీద

పెట్టి కూర్చున్నది. 'యిక్కడ కూర్చుంటే ఒంటరితనంగా వుంటుంది.'

'ఔను, నిజమే' అన్నది హేల్. మరల కుట్టటం ప్రారంభించినది. కుట్టుచున్న నూది వడిలో పడిపోయినది. రకరకాలుగా మాట్లాడుతున్నది.

'నేను అనుకున్న సంగతి చెబుతున్నాను, పీటర్సు - ఆమె యిక్కడ వున్నప్పుడు వచ్చాను—వచ్చాను.'

'నీవు ఎప్పుడూ తీరుబడిలేకుండానే వుంటావు. నీ యిల్లు-పిల్లలు - పనితోనే సరిపోతుంది' అన్నది పీటర్సు.

'నేను వచ్చివుండాల్సింది. నాకు ఉత్సాహంగా లేనందున ఉండిపోయినాను' అంటూ చుట్టూ చూచింది.

'ఈ స్థలం నాకెంతమాత్రం యిష్టంలేదు. రోడ్డులేదు - లోయలో వున్నది. ఎప్పుడూ ఎప్పుడూ ఒంటరితనంగా వుంటుంది - మిన్నీ ఫాస్టర్ను చూచుటకు అప్పుడప్పుడు వచ్చేదాన్ని - యిప్పుడుకూడా చూడగలను.' యివి మాటలలో చెప్పలేదు.

'నిన్ను నీవు నిందించుకోవద్దు. ఏదో వచ్చేటంతవరకు ఎలావుంటుందో మనకెలా తెలుస్తుంది?'

'పిల్లలు ఎక్కువమంది లేకపోతే, పనికూడా తక్కువుగా వుంటుంది. ఆ యిల్లు ప్రశాంతంగా వుంటుంది. మిస్టర్ రైటు రోజంతా పనిచేస్తాడు. ఆమెకు తోడు ఎవ్వరు? జాన్ రైటు నీకు తెలుసా పీటర్సు?'

'తెలియదు - పట్టణంలో చూచాను. మంచివాడని అంటారు.'

'ఔను. నిజమే - అన్నమాటప్రకారం చేస్తాడు. త్రాగుబోతు కాదు. అప్పులన్నీ తీర్చివేశాడు. అయితే అతడు చాలా నిజాయితీగలవాడు. వానితో ఒకరోజు గడిపితే –' చెప్పటం ఆపింది. 'నరాలను పీల్చే మంచుగాలివలె వుంటాడు. ఆమె దృష్టి బల్లమీదవున్న పంజరంమీద పడ్డది.

'ఆమెకు పిట్ట అవుసరమయి ఉంటుం దనుకుంటాను.'

ముందుకువంగి పంజరంవంక చూస్తూ 'దానిలోని లోపం ఏమిటి? పిట్ట ఏమైవుంటుందని పీటర్సు?'

'నాకు తెలియదు. జబ్బుచేసి చనిపోయినదేమో?'

ఆ పంజరం విరిగిపోయినమూతను యిద్దరూ పరీక్షించారు.

'నీకు తెలియదా - ఆమె?'

'నిన్న ఆమె మాయింటికొచ్చినదాకా నాకు తెలియదు.'

'ఆమె ఆలోచించుటకే వచ్చినది. ఆమెకూడా పిట్టవలె వుంటుంది - అయితే పిరికితనంకూడా వున్నది - మార్పు ఎలావచ్చినది?'

'మిసెస్సు పీటర్సు, ఆ బొంతను నీవు ఎందుకు తీసికొని పోకూడదు?'

'మీ అభిప్రాయం బాగానే వున్నది. ఏమీ అభ్యంతరం వుండదనుకుంటాను.' యిద్దరూ ఆ బొంతల బుట్టవంక చూచారు.

'యిదిగో ఎఱ్ఱగా వున్నది' అంటూ ఒగ గుడ్డను తీసి చూపించినది హేల్. దానిక్రింద ఒక పెట్టె వున్నది. దాంట్లో కత్తెర కుట్టుసామానులు వుండును. యిది ఎంత అందమైన

పెట్టె - ఆమె యుక్తవయస్సులో వున్నప్పుడు తెచ్చుకుని వుంటుంది.'

ఒక క్షణం ఆ పెట్టెను చేతిలో పెట్టుకున్నది. మూత తీసి వాసన చూచింది 'ఎందుకు?'

మిసెస్సు పీటర్సు దగ్గరకువచ్చి వెనక్కు వెళ్ళినది.

'ఈ సిల్కుగుడ్డలో ఏదో చుట్టబడి వున్నది.' అన్నది హేల్.

'యిది ఆమె కత్తెరకాదు.' అన్నది పీటర్సు. మిసెస్సు హేల్ ఆ సిల్కుగుడ్డను ఎత్తి పట్టుకున్నది.

'ఓ - పీటర్సు - అది' అని పెద్దగా కేకపెట్టింది. మిసెస్సు పీటర్సు దగ్గరగా వంగి చూచింది. 'అది పక్షి' అన్నది మెల్లిగా.

'అయితే మిసెస్సు పీటర్సు - దానివంక చూడు - దాని మెడవంక చూడు - చూడు!' అన్నది హేల్.

దూరంగా పెట్టెను పట్టుకున్నది.

షెరీఫ్ భార్య వంగి చూచినది.

'ఎవ్వరో దానిమెడను కోశారు.' మెల్లగా దీర్ఘంగా అన్నది పీటర్సు.

మరల ఆ యిద్దరి స్త్రీల దృష్టి కలిసినది. భయం పెరుగుతున్న దృశ్యంగా తోచింది. మిసెస్సుపేటర్సు విరిగి పోయిన పంజరంవంక చూచింది. మరల తిరిగి యిద్దరి చూపులు కలిసినవి. అప్పుడే బయట శబ్దం వినపడ్డది.

మిసెస్సు హేల్, ఆ పెట్టెను బుట్టలోవున్న బొంతల అడుగుభాగమున పెట్టి ఎదురుగావున్న కుర్చీలో కూర్చున్నది.

మిసెస్సు పీటర్స్ బల్లను ఆనుకొని నిలబడి వున్నది. షెరీఫ్, వకీలు బయటనుంచి వచ్చారు.

'ఆమె కుట్టినదో లేక ముడివేసినదో మీరు నిర్ణయించారా?' అని ప్రశ్నించాడు వకీలు.

'ఆమె ముడివేయబోతున్నదని ఆలోచించాం.' అన్నది షేరీఫ్ భార్య. ఏదో ఆలోచనలో నిమగ్నుడై వుంటాన, ఆమె కంఠస్వరంలోని మార్పును వకీలు గమనించలేదు. 'అది బాగానేవున్నది కాని – ఆ పంజరాన్ని చూస్తూ పక్షి ఎగిరిపోయినదా?' అని అడిగాడు వకీలు.

'పిల్లి తినివుంటుందని ఆలోచించాం' అన్నది హేల్.

ఏదో ఆలోచిస్తున్నట్టుగా వకీలు వచార్లు చేశాడు.

'పిల్లి వున్నదా?' అప్రయత్నంగా అడిగాడు. మిసెస్సు హేల్, పీటర్సువంక తీక్షణంగా చూచింది.

'యిప్పుడుకాదు – వారు మూఢనమ్మకము కలవారు – వదిలివేసి వుంటారు.' అన్నది పీటర్స్.

మిసెస్సు పీటర్స్ కుర్చీలో కూర్చున్నది. ఆమెచెప్పిన మాటలు వకీలు వినలేదు.

'ఏమీ గుర్తులేదే-బయటనుంచి ఎవ్వరైనా వచ్చారా? అది స్వంత తాడుగా వున్నదే! మనం పైకివెళ్ళి ముక్కముక్కను తనికీచేద్దాం. అది తెలిసిన వాళ్ళదై వుంటుంది' అన్నాడు వకీలు.

మేడపైకి వెళ్ళారు. సంభాషణ వినిపించుటలేదు. . ఆ యిద్దరు స్త్రీలు పరధ్యానంలో వున్నట్లు చలనం లేకుండా

కూర్చొని వున్నారు. వాళ్ళు మాటాడేది వాళ్ళకే భయం వేస్తున్నది. అయితే మాటాడక తప్పదు.

'పిట్ట అంటే ఆమెకు ప్రేమగనకనే ఆ అందమైన పెట్టెలో పూడ్చి పెట్టింది?' అన్నది హేల్.

'నేను చిన్నపిల్లగా వున్నప్పుడు ఒక పిల్లవాడు చిన్న గొడ్డలి తీసికొని నా పిల్లని-నా కళ్ళ ఎదుట-నేను వెళ్ళేలోగా ఆమె ముఖాన్ని చేతులతో కప్పుకున్నది. వాళ్ళు నన్ను పట్టుకునకుండా వున్నట్లయితే, వాడ్ని కొట్టేదాన్ని;' పైన అడుగుల చప్పుడు వినిపించుచున్నది.

తిరిగి ఆ యిద్దరు స్త్రీలు కదలకుండా మౌనంగా కూర్చున్నారు.

'చుట్టూ పిల్లలు లేకపోతే ఎలా వుంటుందో' అంటూ మిసెస్సు హేల్ ప్రారంభించినది. వంట యిల్లంతా మరొకసారి చూసింది.

'లేదు, రైటుకు ఆ పిట్టఅంటే యిష్టముండి వుండదు-అది పాడే పిట్ట-ఆమెకూడా పాడుతుంది-దాన్నికూడా చంపి వేశాడు' వెలుగు రాశినట్లుగా మాటాడినది.

'పిట్టను ఎవ్వరు చంపారో మనకు తెలియదు కదా' అన్నది పీటర్సు.

'జాను రైటు, నాకు తెలుసు' అన్నది హేల్.

'యీ యింటిలో ఆ రాత్రి భయంకరమైన సంఘటన జరిగింది. మిసెస్సు హేల్ నిద్దురపోతుండే మనిషిని చంపారు. అందులో మెడకు తాడుకట్టి, ఊపిరి సల్పకుండా చంపారు.' అన్నది పీటర్సు.

'మిసెస్సు హేల్ పంజరాన్ని తీసికున్నది. వాని మెడ, నులిమి జీవం లేకుండా చేశారు. వానిని ఎవ్వరు చంపారో మనకు తెలియదు. మనకు తెలియదు.' అన్నది పీటర్సు కోపంగా. మిసెస్సు హేల్ కదలలేదు.

కొన్ని సంవత్సరాలు శూన్యంగా వుండి, తరువాత పాడే పిట్ట ఒకటివుంటే-అప్పుడు అతి భయంకరంగా వుంటుంది, పిట్ట నిర్జీవంగా వున్నప్పటికి. ఈ మాటలు మిసెస్సు పీటర్సు మాటాడలేదు. అయితే ఆమెలోనుంచే బయటకు వస్తున్నవి. దేనినుంచి వస్తున్నవో, ఎందుకు వస్తున్నవో ఆమెకు తెలియదు.

'చలనంలేకుండా నిశ్శబ్దంగా వుండటం అంటే ఏమిటో నాకు తెలుసు' చిత్రంగా అన్నది.

'మేము డకోటాలో వున్నప్పుడు నాకు మొదటగా జన్మించినబిడ్డ రెండు సంవత్సరాలు పెరిగి చనిపోయినాడు. అప్పుడు నేను ఒంటరిగా వున్నాను' అన్నది పీటర్స్.

మిసెస్సు హేల్‌కు కదలికపుట్టింది.

'సాక్ష్యం దొరుకుటకు యింకా ఎంతకాలం పట్టుతుంది మిసెస్సు పీటర్స్?'

'చలనం లేకపోవటం అంటే నాకు తెలుసు. న్యాయ శాస్త్ర ప్రకారం తప్పుకు శిక్ష విధిస్తారు. చట్టం తప్పులను శిక్షించాలి' అన్నది.

'మిన్నీ ఫాస్టరు తెల్లని దుస్తులు ధరించి నీలిరిబ్బను పెట్టుకొని హాయిగా పాడుతుంటే నీవుచూచి వుండాల్సింది' అన్నది హేల్.

'ఆ పిల్ల చిత్రపటం - యిరువది సంవత్సరాలు ఆమె యింటి పొరుగుగా ఉండటం రోజులు లేక చనిపోయినదంటే, మిసెస్సు హేల్‌కు భరించలేని విషయం.

ఓ నేనిక్కడకు రావాలి. అది తప్పు! అది తప్పు! ఆ తప్పులను ఎవ్వరు శిక్షిస్తారు?'

'మనం అలావూహించకూడదు.' అన్నది మిసెస్సు పీటర్స్ మెట్లవంక భయంగాచూస్తూ.

'ఆమెకు సహాయం అవుసరమని నాకు తెల్సి వుండాల్సింది. ఇదంతా విచిత్రంగా మిసెస్సు పీటర్స్-మనం దగ్గరగా వుంటాం - దూరంగా వుంటాం - మనం అంతా ఒకటిగా పోతాం. అన్ని వస్తువులు సమానంగానే చూస్తాం. అందులోనే తేడావున్నది. లేనట్లయితే నీవు, నేను ఎందుకు అర్థంచేసికుంటాం? ఈ నిమిషంలో మనకు తెలిసినది - మనకు తెలుసుకోవలసిన అవుసరం ఎందుకు?'

కళ్ళకు అడ్డంగా చేతిని పెట్టుకున్నది. బల్లమీద వున్న పండ్ల సీసాను తీసికొన్నది.

నేనే నీవు అయినట్లయితే, ఆమె పండు పోయిందని ఆమెకు చెప్పేదాన్ని కాదు—పోలేదని చెప్పు-బాగా వున్నదని చెప్పు - అంతా బాగావున్నదని చెప్పు - నిదర్శనంగా యిది తీసికో - అది పగిలిందో లేదో ఆమెకు తెలియదు.' అన్నది హేల్.

మిసెస్సు పీటర్సు ఆ పండ్ల సీసాను తీసికున్నది. దానిని చుట్టుటకు ఒక గుడ్డను తీసింది. తొట్రుపాటుతో ఆ గుడ్డను సీసాకు చుట్టింది.

'పురుషులు మనమాట వినలేదు - మంచిదే - చని పోయిన పిట్టనుగూర్చి పెద్ద రాద్ధాంతం దేనికి?' అంటూ పనివున్నట్లుగా వెళ్ళినది.

మేడపైన అడుగులధ్వని వినిపించుచున్నది.

'తెలియవచ్చు - తెలియకపోవచ్చు?' అన్నది హేల్.

'లేదు, పీటర్సు - అంతా స్పష్టంగావున్నది. కారణం ఒక్క టే తెలియుటలేదు. ఏదో ఒకటి స్పష్టంగా వున్నప్పుడు చూడగల్గినప్పుడు - కథ లాగుటకు వీలుగా నున్నప్పుడు - పంచాయితీదార్లు ఏంజేస్తారో నీకుతెలుసు.' అన్నాడు వకీలు.

మిసెస్ హేల్ రహస్యంగా మిసెస్సు పీటర్సువంక చూచింది. యిద్దరూ చూచుకుంటున్నారు. యింతలోనే తలుపుతీసికొని మిష్టర్ హేల్ వచ్చాడు.

'అంతా సిద్ధంగా వున్నారు' అన్నాడు.

'కాన్సేపు ఒంటరిగా యిక్కడనే వున్నాడు' అన్నాడు వకీలు.

'నీకోసం గ్రాంకును బయటకు పంపమంటావా?' షెరీఫ్‌ను అడిగాడు.

'నేనంతా చూడాలి. నాకు తృప్తిగాలేదు' అన్నాడు.

మరల ఒక రెప్పపాటు కాలం ఆ యిద్దరి స్త్రీలదృష్టి ఒకటిగా మారింది.

షెరీఫ్ బల్లదగ్గరకు వచ్చాడు.

'మిసెస్సు పీటర్సు ఏమితీసికొని పోవుచున్నదో చూస్తారా?'

వకీలు నవ్వాడు.

'ఆ స్త్రీలు తీసుకున్నవి అంత అపాయంగా లేవనుకుం టాను.'

పెట్టె దాచివుంచిన బుట్టను మిసెస్సు హేల్ పట్టు కున్నది. ఆ బుట్టలో పై భాగమున బొంతలకు పనికివచ్చు గుడ్డల దారాలు పేర్చింది. ఆమె నేత్రాలు కోపంతో మండి పోతున్నాయి. అతడు గనుక బుట్టను తీసికుంటే, లాక్కో వాలనే ఆవేశం ఆమెలో కల్గింది.

అయితే అతడు బుట్టను తీసికొనలేదు. చిరునవ్వు నవ్వుకుంటూ వెళ్ళాడు. 'మిసెస్సు పీటర్సుకు తనికీ చేయవలశిన అవుసరంలేదు. ఆవిషయంలో షెరీఫ్ భార్య న్యాయశాస్త్రాన్ని వివాహం చేసుకున్నది. ఆ విధంగా ఆలోచించలేదా మిసెస్సు పీటర్సు ?'

మిసెస్సు పీటర్సు బల్లపక్కనే నిలబడి వున్నది. మిసెస్సు హేల్ ఆమెవంక తీక్షణంగా చూచింది. అయితే ఆమె ముఖాన్ని చూడలేదు. మిసెస్సు పీటర్సు తిరిగి వెళ్ళినది.

'యిదికాదు – అటూ మార్గం.' అన్నది.

'న్యాయశాస్త్రాన్ని వివాహంచేసికున్నావు.' అన్నాడు. పీటర్సుభర్త. ముందు గదితలుపు దగ్గరకు వెళ్ళి, 'ఒక నిమిషం యిచ్చుటకు రాండి – యీ కిటికీలను చూడాలి' అన్నాడు షెరీఫ్.

'కిటికీలా' పరిహాసంగా అన్నాడు వకీలు.

'మిష్టరు హేల్ మనం వెళ్ళుదాం.' అన్నాడు షెరీఫ్.

గుఱ్ఱాలను తెచ్చుటకు మిష్టరు హేల్ వెళ్ళెను. షెరీఫ్ వకీలు వెంట మరొక గదిలోకి వెళ్ళెను. మరల తుది సారిగా ఆ యిద్దరు స్త్రీలు ఒంటరిగా వున్నారు.

చేతులను గట్టిగా బిగపట్టుతూ, ఆమెవంక చూస్తూ, మార్తా హేల్ గభాలున లేచింది. మొదట్లో మిసెస్సు పీటర్సు నేత్రాలు కాన్పించలేదు. న్యాయశాస్త్రాన్ని పెండ్లి చేసికున్నది అనగానే ఆమె వెనక్కు తిరిగి వున్నది. మిసెస్సు హేల్ నేత్రద్వయం ఆమెను వెనక్కు తిప్పించినవి. నెమ్మదిగా అయిష్టతగా మిసెస్సు పీటర్సు తలతిప్పి ఆమె నేత్రాలను చూచింది. ఆ నిలకడైన మండే చూపులో జంకుగాని, గొంకు గాని లేదు. అప్పుడు మార్తా హేల్ నేత్రాలు బుట్టవంకకు చూపించినవి. ఆ బుట్టలోని రహస్యం బయటపడితే ఆమెకు — ఆమె యిక్కడలేదుగాని — ఆమెనుగూర్చి గంటనుంచీ మాట్లాడుకున్నారు — ఆమెకు శిక్ష తప్పదు.

ఒక క్షణకాలం మిసెస్సు పీటర్సు కదలలేదు. మరు క్షణంలో అచ్చటకు వెళ్ళి బుట్టలోని బొంత సామాన్లు దొర్లించి, పెట్టెతీసికొని తన చేతిసంచిలో దాచిపెట్టింది. అది బరువుగా లావుగా వున్నది. అతి సాహసంగా, నిరాశతో మూత తెరిచింది. పిట్టను బయటకు తీయుటకు ప్రయత్నించినది. అక్కడే ఆమె తప్పటడుగు వేసింది. పిట్టను ముట్టుకోలేక పోయింది. నిస్సహాయంగా తెలివితక్కువగా నిలబడిపోయింది.

లోపల శబ్దం వినిపించినది. షెరీఫ్, వకీలు తిరిగి వంట యింటిలోనికి వచ్చేటప్పటికి, మార్తాహేల్ ఆమె చేతిలోని

పెట్టెను అమాంతంగా లాక్కొని తన పెద్ద గౌను జేబులో దాచిపెట్టింది.

'కనీసం ఆమె దాన్ని తిరిగి కుట్టలేదు - యిదన్నా మనం కనిపెట్టాం - మీరేమంటారు ?' అన్నాడు వకీలు. మిసెస్సు హేల్ జేబును గట్టిగా పట్టుకున్నది.

'అలాగే అందాం - ముడివేద్దాం, హెన్డర్సన్' అన్నది.

# కౌరు

## రచన: డోరోతి థామస్

[డోరోతి థామస్ (1898) బార్నెస్, కాన్సాస్‌లో జన్మించినది. ఈమె మతాచార్యుని కూతురు. వెల్ష్ వంశానికి చెందినది. బాల్యమంతా ఈమె తండ్రి ప్రచారంచేసే చిన్నచిన్న పట్టణాల్లో గడిపింది. ఆమెకు ఏడుసంవత్సరాలు వయస్సు వచ్చినప్పుడు, సంసారమంతా బాటిల్ లేక్ కు దగ్గరగావున్న ఆల్బర్టాకు మార్చబడినది. అక్కడ అనేక సంవత్సరాలు కాలం గడిపారు. తరువాత యునైటెడ్ స్టేట్సుకు వచ్చారు.

మూడుసంవత్సరాలు బెతానీ నెబ్రాస్కా హైస్కూలులో చదువుకున్నది. వేసవిశలవులలో తీరుబడి సమయాల్లో స్టోర్సు గుమాస్తాగా పనిచేసింది. అప్పుడే మూడుసంవత్సరాలు కాలేజీ శిక్షణ పొందినది. అప్పటినుంచే రచనలు ప్రారంభించి విడవకుండా సాగించింది. మిడిల్ వెస్టులో చిన్నచిన్న పట్టణాలలో నివసించే వారి సంసారాలనుగూర్చి ఆమె కథలలో చిత్రించింది. హార్పర్సు పత్రికలో ఆమె కథలు అనేకం ప్రచురింపబడినవి. Home Place అనే పేరుతో కొన్ని కథలు పుస్తకరూపంగా వెలువడినవి. 'Home Place' అనే నామకరణము 1935 యి ఓ హెన్రీ మెమోరియలు యవార్డు ద్వితీయ బహుమతిని పొందినది.

బి. హెండ్రిక్ ఎడిట్ చేసిన Americans all అనేకథానిక నుండి యీ 'కారు' కథ గ్రహింపబడినది.]

రెండు నిమిషాలకు తక్కువగా ఏడు గంట లయినది. మిసెస్సు జోసఫ్ బార్టన్ మెదుపులాగా పక్కమీద లేచి కూర్చున్నది. ఆమె ఆకృతి చూస్తే, ఒక స్త్రీ ఒక పనిని నిర్ణీత కాలంలో చేయుటకు ముందుగానే నిర్ణయించుకొని గడియారం ప్రకారం టంచెన్‌గా లేచినట్లువలె వున్నది.

కొన్ని నిమిషాలయిన తరువాత ఆమె భర్త నిద్దురలేచి నిద్రమత్తులో ఆమెవంక ఓరగా చూచాడు. 'నేను సరిగా చూస్తున్నానా లేక నీవు నా గుడ్డలను సవరిస్తున్నావా?' అని ప్రశ్నించాడు.

ఈ మాటలకు ఆమె సిగ్గుపడి నవ్వింది. 'నేనే' అని సమాధానం చెప్పింది. ఇస్త్రీ చాకలికి బట్టలువేయుటకు మాసిపోయిన గుడ్డలన్నీ సర్దుబాటు చేస్తున్నది. భర్త చొక్కాలోవున్న చిల్లరడబ్బులు, తాళాలరింగు, చిన్నచాకు బల్లమీదవున్న ట్రేలో పడేసింది. చిత్తుకాగితాలను బుట్టలో పడేసింది.

'ఈరోజు ఏదో మీకు తెలుసా ? ఈరోజు ఆదివారం అండి' అన్నది మిసెస్సు బార్టన్.

నాకు తెలుసు - ఆదివారం చాలా అందమైనరోజు - సుఖంగావుంటుంది.' అన్నాడు భర్త.

'అందంగానే వుంటుందండీ' అంటూ భర్తతో సరస మాడింది. ఆమె బుగ్గలు లేతగులాబీ రంగులో వున్నవి.

మిష్టరు బ్రార్టన్ తిరిగి కునికిపాట్లుపడకపోయినట్లయితే, మిసెస్సు బ్రార్టన్ బుగ్గలఅందాన్ని, సరస సల్లాపాల్ని చూచి ఎంతగానో ఆనందపడేవాడు.

గుడ్డలన్నీ సర్దుకొని మిసెస్సు బ్రార్టన్ కొడుకులు పడక గదికి వెళ్ళినది. భోజనం తెచ్చేముందు పిల్లలందర్నీ చూచు కోటం ఆమెకు అలవాటు. ఆమె కుమారులిద్దరూ, డిక్, జేరీ గాఢనిద్దురలో వుంటాన ఆమెరాక గమనించలేదు. పిల్లలంతా రకరకాలుగా, అడ్డదిడ్డాలుగా పడుకున్నారు. నిశ్శబ్దంగా వారి దుస్తులను వస్తువులను సరిజేసి, ఎండ పడకుండాచూచి, ఆడ పిల్లల గదిలోనికి వెళ్ళినది.

శారాలూయీ జీవచ్ఛవమువలె బంతిలాగ వుండ చుట్టుకొని, దిండుమీద పరిధివలె పడుకొని వున్నది. కూతురు స్టాకింగ్సు, బూట్సు, గౌనులు, పాకెట్టు పుస్తకం చిందర వందరగా వుంటే జాగ్రత్తపెట్టింది. పాకెట్టు పుస్తకం క్లిష్టు చప్పుడుకు శారాలూయీకి మెళుకువ కల్గింది. ఆ పిల్లకళ్ళు తెరవకుండానే 'అమ్మా, నీవా ? ఆ దీపం నా కళ్ళలలో పడు తున్నది – ఆర్పవే అమ్మా ?' అన్నది.

'దీపంగాదే అమ్మాయీ, సూర్యరశ్మి వెలుతురు పడ కుండా కర్టెన్ వేస్తాను.'

'అలాగే చేయి, అమ్మా' అంటూ మరల శారా లూయీ ముడుచుకొని నిద్దురపోతున్నది.

మిసెస్సు బ్రార్టెన్ వంట యింటిలోనికి వెళ్ళినది. 'బిస్కట్లు చేస్తాను' అని అంటూ వంటసామానుగదినుంచి

వెళ్ళేం, రిఫ్రిజిరేటరునుంచి గుడ్లు, పాలు తెచ్చింది. బిస్కట్లు తయారుచేయటం ప్రారంభించినది.

ఒక గుడ్డు పగిలింది. దానిని అయిదు భాగాలుగా గుర్తుపెట్టింది. బిస్కట్లు బాగా వుంటాయి. డేవీకి అపరిమితమైన ప్రీతి. అందరికన్నా ఎక్కువభాగం కావాలి. ఎక్కువగా తింటాడు. కొన్ని తయారుజేసి పిల్లలందర్ని రమ్మనమని 'బిస్కట్లు, వేడి వేడి బిస్కట్లు, ముందర ఎవ్వరొస్తారో' అంటూ వాళ్ళను నిద్దుర లేపింది. వాళ్ళమ్మ వాళ్ళకే ముందుగా పెట్టుతుందని వాళ్ళకు తెలుసు. మిష్టరు బార్టన్ ముందుగా వచ్చాడు.

'శాలీ, బిస్కట్లు' అన్నాడు.

'ఏమండీ, డేవీ వాటిల్లో భాగం తీసికుంటారా?'

'తయారైనదాకా మరొకటి వుంటాను. శాలీ, కాగితం తెచ్చుకున్నావా?'

శాలీ కాగితం తెచ్చుకొని తండ్రివక్కనే కూర్చుంది.

'యివిగో నీ బిస్కట్లు' బార్టన్ అన్నది.

'పానకం కావాలా, తేనె కావాలా? పండ్లరసంకూడా వున్నది' అన్నాడు బార్టన్. మిసెస్సు బార్టన్ కప్పులో కాఫీ పోస్తున్నది.

'నీకు తెలియదూ, నేను తొందరగా వెళ్ళాలి. ఆదివారం వస్తే నేను చిన్నపిల్లవాడినిగా వుంటాను. ఆలస్యం అయితే నే వుండను.' అన్నాడు బార్టన్.

'ఆదివారం అందమైన రోజు. యిదిగో యింకొక బిస్కట్టు.' అన్నది మిసెస్సు బార్టన్.

ఇంతలోనే డేవీ వచ్చాడు. 'అమ్మా, గుడ్ మార్నింగ్ నాన్నా గుడ్ మార్నింగ్' అన్నాడు. డేవీకి పదహారు సంవత్సరాలుంటాయి. వానికి ఏదైనా కావల్సివచ్చినప్పుడు తల్లిదండ్రులను ఆప్యాయంగా పిలుస్తాడు.

'ఇవిగో డేవీ, నీకు నాలుగుబిస్కట్లు వుంచాను.' అన్నది తల్లి.

'అందులో ఒకటి విరిగిపోయినదమ్మా' కోపంగా చూచాడు డేవీ.

'డిక్కు లేచాడా?' అని ప్రశ్నించింది.

'నాకు తెలియదమ్మా.'

'నీకు తెలియదా, వాడు అక్కడ లేడా?' అని తండ్రి ప్రశ్నించాడు.

'వాడు అక్కడే వున్నాడు. వాడు నన్ను చూడడు-నేను వాడ్ని చూడను. ఎందుకు చూడాలి?' అన్నాడు డేవీ.

'ఏమిటిరా నీవు మాటాడేది? డిక్కు నిన్నెందుకు చూడడు? వాడి తప్పేమిటి? మరల తండ్రి ప్రశ్నించాడు.

'నాకు తెలిసినంతవరకు వాడు నన్ను చూడడు-నేను చూడను.'

మిష్టరు బార్టను యిట్టి కుమారులను కన్నందుకు భార్య వంక ఎగతాళిగా చూచాడు. 'వాడు చెప్పేదేమిటంటే డిక్కు తనకంటే పెద్దవాడని-16, 20, సంవత్సరములకు వ్యత్యాసముంటుందని చెబుతున్నాడు.' అంటూ నెమ్మదిగా చెప్పింది

మిసెస్సు బార్టన్. 'అలాగా' అంటూ మిష్టరు బార్టన్ పత్రిక చదవటం మొదలు పెట్టాడు.

'నాతో పోట్లాడుతాడు? అన్నాడు జేపీ.

'లేదులే, యిదిగో యింకో బిస్కట్టు.'

దుస్తులు ధరించి డిక్కు తయారుగా వచ్చాడు. 'గుడ్ మార్నింగ్ అమ్మా, గుడ్ మార్నింగ్ నాన్నా' అన్నాడు బల్ల దగ్గరగా వున్న జేపీని చూచాడు.

'గుడ్ మార్నింగ్, జేపీ' అన్నాడు.

'నాన్నా, ఆటలపోటీల సంగతి చదువు.' అన్నాడు డిక్కు.

'వింతలు, వినోదాలు చదువు నాన్నా' అన్నాడు జేపీ.

'అరె అబ్బాయిలూ, ముందర మీ భోజనం కాని వ్వండి-యీలోగా పేపరు చదవటం పూర్తిచేసి మీకు యిస్తాను' అన్నాడు బార్టన్.

'దీనితో బొమ్మని గీశావు, డిక్కు?' జేపీ ప్రశ్నించాడు.

'సీమైనంతో కాదురా?' అన్నాడు డిక్కు.

వాళ్ళ సంభాషణ విని తల్లి నవ్వింది.

'మనం పిల్లలుగా వున్నప్పుడు అలా చెప్పేవాళ్ళం, సీమైనం కాదు' ఈమాట ఎవ్వరు నేర్పారురా! ఈ మాట సంవత్సరాలుగా నేను వినలేదు. జేపీ, ఏమంటావు?'

డిక్కు కారును కడగబోతున్నాడనుకుంటాను' అన్నది.

'నిజమేనమ్మా' అన్నాడు డిక్కు.

'నాన్నా మిమ్మల్ని ఒకటిఅడగాలి అనుకుంటున్నాను' అన్నాడు జేపీ.

'ఏమిటిరా ?'

'కారు కావాలి నాన్నా.'

చదువుతున్న న్యూసుపేపరు మిస్టరు బార్టన్ మడత పెట్టాడు. నేను 'చెబుతున్నా విను' అంటూ ప్రారంభించాడు. యింతలోకి పెద్దవాడు అడ్డువచ్చి. 'ఏదో ఒక ఆదివారం కారు తీసికొనవచ్చును. కారు ఉపయోగించేముందు డ్రైవింగ్ కొద్దిగా తెలిసివుండాలి' అని జేపీకి చెప్పాడు. వంటయింటిలో నుంచి శారాలూయీవచ్చి తండ్రి ప్రక్కనే కూర్చున్నది.

'కారుసంగతి ఏమిటినాన్నా ?' అని ప్రశ్నించినది.

'ఈ బిస్కటులిను శారా - నాకు చాలా వున్నాయి' అన్నాడు తండ్రి.

'కారుసంగతి యిప్పుడే జేపీకి చెబుతున్నాను. డ్రైవింగు తెలియనిదే కారు అనవసరం' అన్నాడు డిక్కు.

'అట్లాగా - నీకు తెలియనిదే కారు ఎలా నడుపుతావు. వచ్చే ఆదివారమో మరొక ఆదివారంనాడో తీసికుందువుగాని' ఈ ఆదివారంనాడు కావాలి అన్నది శారా.

'ఈ రోజు నీవు తీసుకొనుటకు వీల్లేదు' గట్టిగా అన్నాడు జేపీ.

'చూద్దువుగాని - యీరోజు నేను కారు తప్పకుండా తీసికొంటాను - నేను వినోదయాత్రకు వెళ్ళాలని మంగళ

వారం సాయంత్రం చెప్పాను కాదు - నాన్నా - ఈ రోజు నాకు కావాలి' అన్నది శారా.

'ఎక్కడకు వెళ్ళుతావు అమ్మాయి? డిక్కు మరొక బిస్కట్టు కావాలా ? అన్నది బార్టన్.

'పాతాళగంగకు వెళ్ళాలి. వినోదయాత్ర చేస్తున్నా నీకు చెప్పటం మరచిపోయినాను-అమ్మా' అన్నది శారా.

'శారా, నీవు వినోదయాత్రకు వెళ్ళాలంటే కారులేదని స్నేహితులకు చెప్పు. నేను కారు ఉపయోగించుకుంటాను. కారును శుభ్రంగా నీటిలో కడుగుతాను. సాయంత్రం రెండు గంటలకు కావాలి. ఇదివరకే నిర్ణయించుకున్నాను. కావాలంటే అమ్మనుఅడుగు' అన్నాడు డిక్కు.

'నీవు కారు కావాలని బుధవారం చెప్పావు. చాలా ఆలస్యంగా చెప్పావు - నేను మంగళవారమే చెప్పాను. ఈ ఆదివారం కారు కావాలని నేను ముందుగా చెప్పలేదు నాన్నా ?' అన్నది శారా.

'ఈ బిస్కటు ఎవ్వరికీ అవుసరం లేదా ?' అన్నది మిసెస్సు బార్టన్.

'కొన్నాళ్ళు ఆగితే నీవంతు వస్తుంది జేవీ - యిప్పుడు నాకు లైసెన్సు వచ్చింది. కారు నేను ఉపయోగిస్తాను.' అన్నాడు డిక్కు.

'ఈ ముగ్గురి పిల్లలనుతీసుకొని యీరోజు నీవు కారును ఉపయోగించుకుంటావా ?' అని ప్రశ్నించాడు భార్యను.

'నాకు కాఫీ అవసరంలేదు. క్రిందటిరాత్రే నిర్ణయించు కున్నాను. ఈరోజు అనుకూలంగా ఐతే, పిక్నిక్ వెళ్ళు తాను' అన్నది మిసెస్సు బార్టన్.

'బాగావున్నది. నీవు కారుకావాలని అనుకోలేదు - యిప్పుడు ముగ్గురుకాక నల్గురే ఆశాభంగం చెందుతారు. ఈరోజు నాకు కావాలి - నాకు పనివున్నది.' అన్నాడు బార్టన్.

త్రాగుతున్న కాఫీకప్పు క్రిందపెట్టి తండ్రివంకచూస్తూ, 'సరేలే, నాన్నా, నీవు క్లబ్బుకు వెళ్ళాలనుకున్నావుకదూ? నీవు క్లబ్బులో 'గోల్ఫ్' ఆట ఆడాలనుకున్నావు. నేను తీసి కొనివెళ్ళి దిగబెట్టుతాను. అమ్మా, ఐస్ బాక్సులో వున్న కోడి మాంసమును తీసికొనేదా?'

'దాంతో పిండివంట చేద్దామనుకున్నాను. సరె, తీసి కొని వెళ్ళు శారా.' అన్నది తల్లి.

'అది నాకుయిష్టం - నీవేమంటావు. శారా కారుతీసి కుంటున్నది కదా.' అన్నాడు డేవీ.

'ఈసారి డిక్కుకుగాని, శారాకుగాని కారు అందదు. ఈరోజు నాకు కావాలి డేవీ' అన్నాడు బార్టన్.

'గుడ్ నైట్, నాన్నా - ఈ తేదీ సంగతి బుధవారం నాడే చెప్పాను. చివరి నిమిషంవరకు వుండి ఆశాభంగం చెందటం మంచిదికాదు.' అన్నాడు డిక్కు.

'నేనూ అదే చెబుతున్నాను. నేను మంగళవారం నాడే చెప్పాను. హైలీని కలుసుకున్నాను.' అన్నది శారా.

'అమ్మా, ఆ కోడిమాంసమును శారాకు యివ్వద్దు-వాడితో నీవు ఎందుకు వెళ్ళాలి? రైలీతో వెళ్ళుటకు ఒకతేదీ నిర్ణయించుకున్నావు గదా!' జేపీ పెద్దగా అన్నాడు.

'వాడి తప్పేమున్నది.' అన్నది శారా.

'వాడు పెంకెవాడు——'

'నాన్నా, నేను కారు తీసికొనివెళ్ళి శుభ్రంగా నీటితో కడుగుతాను.' అన్నాడు డిక్కు.

'ఇదుగో చూడు - నిరుడు వేసవిలోకూడా కారు కావాలంటే ఎవ్వరినో ప్రాధేయపడ్డాను. ఒక్కసారికూడా కారు ఎక్కే అవకాశం నాకులేదు - యీ వేసవిలోకూడా - ఆది వారం ప్రతి ఆదివారం——' అన్నాడు బార్టన్.

'జూన్ మూడోవారంలో మాత్రమే జరిగింది' అన్నది భార్య.

'నే చెప్పేది విను——పిల్లలంతా-అందరి పిల్లలు వాళ్ళ ఊహాప్రపంచంలోనే వుంటారు-ప్రపంచం వాళ్ళచుట్టూ తిరుగుతుందని అనుకుంటారు. పెద్దలు, తల్లిదండ్రులు సుఖంగా వుండాలనే ఆలోచనే వుండదు. మనం ఏంజేస్తున్నామోచూడు-ఒక్కసారికూడా కారు లేకపోయింది——' అన్నాడు మిష్టరు బార్టన్.

'ఒక్క అవకాశంకూడా లేకపోయింది' అన్నాడు.

'నాన్నా, ఉపన్యాసాలకో, మరెక్కడకో వెళ్ళుతుంటిరి కదా' అన్నాడు జేపీ.

నాన్నా, నేను తీసికొని వెళ్ళుతానని చెప్పాను, అక్కడ నిన్ను ఎవ్వరో ఒకరు నిన్ను కారులో ఎక్కించుకొని వస్తారు' అన్నది శారా.

'ఎన్నిసార్లు యితరుల కార్లు ఉపయోగించేది. విసుగు పుట్టుచున్నది. నిన్న యిద్దరి స్నేహితులను అడిగాను—' అన్నాడు.

'వచ్చేటప్పుడు అమ్మ డబ్బుయిస్తుంది.' అన్నాడు డేవీ అసందర్భంగా.

'ఔను. నిజమే, నిజమే. ఆమె మంచిపనే చేస్తుంది. అదంతా నీ కోసమే. ఆమె ఋణం మీరు ఏవిధంగా తీరుస్తారు. ఆమె కారు ఉపయోగిస్తే ఎంతవస్తుంది. నిదానంగా ఆలోచించండి.' అన్నాడు బార్టన్.

నాకు కారు అవుసరంలేదని యిదివరకే చెప్పాను. నేను షికారువెళ్ళుతాను. సంచిలో యాపిల్సుపండ్లు, మాంసాహారం నావెంట తీసికొని వెళ్ళుతాను. భోజనానికి యింటికి రాను. రాత్రే నిర్ణయించుకున్నాను. మనకు కారులేనప్పుడు మనమంతాకలిసి షికారువెళ్ళటం - శారా నడవలేకపోతే మీరు ఎత్తుకొనటం, యివన్నీ గుర్తుకు వస్తున్నాయి.' అన్నది మిసెస్సు బార్టన్.

'నాన్నా కారుని శుభ్రంచేసికొని రాగానే నిన్ను ఎక్కించుకొని వెళ్ళుతాను. స్నేహితులను అడిగానని చెప్పావు. ఎవ్వరా స్నేహితులు?' అన్నాడు డిక్కు వినయంగా.

శారా అక్కడనుంచి లేచింది. ముఖం తిప్పుకున్నది. ఉదయించే సూర్యకిరణాలు ఆమె ముఖాన పడి ప్రకాశిస్తు న్నాయి. 'కారుకు ముందరగా అడగటం - చెప్పటం-యిన్ని జేసినా అంతా వృథాప్రయాస అయింది. నన్నుగూర్చి నా స్నేహితులు ఏమనుకుంటారో నాన్నా, నాకెంత నామోషిగా వుంటుందో ఆలోచించు. ఆఖరుక్షణంలో ఆశాభంగంచేయటం మర్యాదగాదు' అన్నది శారా.

'ఏమిటి నీవు చెబుతున్నది - వాడు వట్టి వెధవ' అన్నాడు జేపీ.

'కారు తీసికొని వెళ్ళు శారా - యిబ్బందిపెట్టటం నా కిష్టటం లేదు - నా స్నేహితులు బ్లయన్, మారోన్ పిలు స్తాను - వాళ్ళకు వీలుగాకపోతే బస్సులో వెళ్ళుతాను. కారు తెచ్చినప్పుడు, అయిదు తాళంచెవులు తెమ్మనమని చెప్పినది మా అమ్మ' అన్నాడు బార్టన్.

‚దానికి కారు యిస్తానంటారా?' అని డిక్కు అడిగాడు. కుర్చీలోనుంచి లేచాడు.

'మీలో మీరే సమాధానపడండి - నాకేం సంబంధం లేదు-నా స్నేహితులకు ఫోనుచేసి బస్సుకోసం వేచివుంటాను' అన్నాడు బార్టన్.

'నాన్న బస్సుమీద వెళ్ళుటకు వీల్లేదు. నేను వారిని తీసికొని వెళ్ళుతాను. భోజనంచేసి, బట్టలుధరించి, ఫలహారం తీసికొని వెళ్ళుతాను. అమ్మా, ఆ కోడిమాంసం తప్ప యింకే మైనా వున్నదా?' అన్నది శారా.

'కారును శుభ్రంచేయుటకు వెళ్ళుతున్నాను' అన్నాడు డిక్కు. తలుపుదగ్గరకు వెళ్ళి, 'కారు నేను ఉపయోగిస్తాను' అన్నాడు.

'బంగాళాదుంపల కూరచేశాను-పులుసు చేసియిస్తాను- తీసికొనివెళ్ళు కారా' అన్నది తల్లి.

చాలా ఆలస్యం అవుతూంది అమ్మా - నాన్నా అన్నయ్య కాలమంతా వ్యర్థంచేశారు. నేను యింకా దుస్తులు వేసుకోవాలి. అమ్మా నీవుగాని, నాన్నగాని, డేవీతో చెప్పండి. వాడికి తెలియనివాళ్ళను గురించి అసభ్యంగా మాట్లాడవద్దని చెప్పండి' కారా.

ఇక్కడే వున్నాను కారా - నాతో ఎందుకు మాట్లాడ కూడదు? అన్నది' అన్నాడు డేవిడ్.

మిష్టర్ బార్టన్ కుర్చీలో కూర్చుని పేపరు చదువు కుంటున్నాడు. మిసెస్సు బార్టన్‌వచ్చినది. 'నేను కారుతీసుకొని వెళ్ళాలనే అనుకుంటున్నాను. ప్రతి ఆదివారం వాళ్ళు తీసు కొనిపోవటం సబబుకాదు-'అన్నాడు భార్యతో.

'నేను షికారు వెళ్ళుతున్నాను - రాత్రే అనుకున్నాను యింకా కొన్ని పనులుకూడా చెయ్యాలనుకున్నాను. నేను వెళ్ళి బట్టలు కట్టుకుంటాను అన్నది.

వెంటనే మిసెస్సు బార్టన్ వెళ్ళి తెల్లని మల్లెపూలాంటి దుస్తులు ధరించి, కాళ్ళకు బూట్లు, తలకు టోపీ పెట్టుకొని అందంగా తయారై వచ్చింది.

'బాగా వున్నావు శాలీ అన్నాడు భర్త.'

'మీరు – నాతో వస్తారా?'

మిస్టరు బార్టన్ తల ఊపాడు. 'ఈరోజు ఒక్కటే నాకు ఆడుకొనుటకు వీలు వుంటుంది.' మిసెస్సు బార్టన్ చిరునవ్వు నవ్వింది.

'బాగా షికారు వెళ్ళిరా అన్నాడు భర్త.'

'అట్లాగే వెళ్ళివస్తాను' అంటూ భర్తవంక క్రీగంటిచూపు చూచింది. ఆమె చిన్నపిల్లగా వున్నప్పుడు, ఆమెను ప్రేమించినపుడు అలాగే చేస్తాను' అని మిస్టర్ బార్టన్ చిన్ననాటి సంగతులు గుర్తుకు తెచ్చుకున్నాడు.

వంటయింటిలో శారా – కూర, రొట్టె తయారు చేస్తున్నది. మిసెస్సు బార్టన్ లోనికి వెళ్ళినది.

'మామూలు రొట్టె, వెన్న, కూరా బాగుండవా అమ్మా?' అన్నది.

'బాగానే వుంటాయి – వెళ్ళివస్తాను అమ్మాయి'

'నీవు వెళ్ళుతున్నావా అమ్మా – పులుసు తయారు చేయుటం నేర్పుతావనుకున్నాను.'

కారులో కూర్చుని చెల్లెల్ని పిల్చాడు డిక్కు.

'చెల్లీ నా తాళం చెవి మేడమీద మరచి పోయాను. నీ దిస్తావా?' అన్నాడు.

మిసెస్సు బార్టన్ షికారు వెళ్ళుటకు సిద్ధమై మెట్ల మీద నిలబడ్డది.

'అమ్మా, ఎక్కడకు వెళ్ళుతున్నావు?' డిక్కు అడిగాడు.

'నేను చెప్పలేదా డిక్కు, షికారు వెళుతున్నాను.'

'సరేలే, అమ్మా!'

మిసెస్సు బార్టన్ కారు దగ్గరకు వచ్చినది. చక్రం మీద ఆమె సన్నని వ్రేళ్ళు పెట్టి, 'దగ్గరత్రోవన వెళ్ళుతాను-కారుకు యీరోజు అదృష్టం పండింది.' అన్నది.

తల్లి కొడుకు సరదాగా మాటాడుకొని మిసెస్సు బార్టన్ షికారు వెళ్ళినది.

సందు చివరకు రాగానే మిసెస్సు బార్టన్ సందేహించినది. ఎడమ పక్కకు తిరిగి వీధిలో గబగబా నడిచినది. మరల మలుపు వచ్చినది. తిరిగి సందేహించినది. ఈసారి కుడి ప్రక్కకు తిరిగింది. మరింత వేగంగా నడిచింది. రెండుబారులు నడిచిన తరువాత ఆమె గుండెను బుజాలను తడుము కున్నది. ఎవ్వరో స్త్రీ వెనకాలే వస్తున్నట్లుగా భావించినది. తిరిగిచూస్తే ఎవ్వరూలేరు. తిరిగి కుడివైపు సందు చివరవరకు వెళ్ళినది. బస్సుస్టాండుకు చేరింది. స్టేషన్‌లో వెచ్చగా వున్నది. దానికి ఎదురుగా ఒక చిన్న పార్కు వున్నది. పిల్లలు చిన్నవాళ్ళుగా వున్నప్పుడు ఆ పార్కుకు తీసికొని వెళ్ళినట్టుగా జ్ఞాపకం వచ్చినది. దాని వంక చూచింది. ఆ పార్కు అసాధారణంగాను, ఒక వింతశోభను యిస్తూ, ఆహ్వానిస్తున్నట్లుగానూ వున్నది. అది శిథిలావస్థలో వున్నను ఆమె అక్కడకు వెళ్ళినది. ఆ

పార్కులో అనేక త్రోవలున్నవి. ఒక మార్గంలో వున్నది. వీధి కాన్పించలేదు. మరుగుగా వున్నది. ఆత్రోవ అంచులన కొన్ని వికసించిన పూలు, త్రుంచినపూలు సంస్కారం లేని మొగ్గలు వున్నాయి. కొన్ని అడవిపూలవలె వున్నాయి. ఆ పార్కులో బెంచి కనపడేవరకు నడిచింది. ఆ బెంచి కూడా రంగుపోయి జీర్ణావస్థలో వున్నది. వెనుకటి సంగతులు గుర్తుకు తెచ్చుకున్నది. జీవితంనుంచి బయటపడినట్లుగా తోచింది. జరిగిపోయిన సంగతులు ఊహించుకుంటూ ఆనందపడ్డది. అక్కడ ప్రశాంతంగాను హాయిగాను వున్నది.

బల్లమీద కూర్చున్నది. ఆమె తెల్లని పాకెటు నోటు పుస్తకం తీసి చేతిరుమాలా ఒకటి తీసింది. టోపీతీసి మోకాళ్ళ మీద పెట్టుకొని, మెడ, ముఖం తుడుచుకున్నది.

పార్కులోని చెట్లమీద పక్షులు గానం చేస్తున్నాయి. ఆ పాటల శబ్దంతోబాటు కారుల ధ్వని వినపడుతున్నది. ఆ కారులు వింత వింత ధ్వనులతో పరుగెత్తుతుంటే ఆమె అనేక సంసారాలను గూర్చి ఆలోచించినది. ఆదివారంనాడు వుండే కోర్కెలు చంపుకొని ఎంతమంది కారులలో వస్తున్నారో అని వింత వింత ఆలోచనలు చేసింది. భర్తను గుర్తుకు తెచ్చుకొని ఆమె ఆలోచన చెప్పాలనుకున్నది. వారు చేప్పే సమాధానంకూడా ఆమె ఆలోచించినది. 'నూటికి తొంభయి మంది' అని అంటారు అనుకున్నది. 'నూటికి సుమారు తొంభయిమంది' అని తాను జవాబుచెప్పినట్లుగా తలచినది.

యింతలోనే యుక్తవయస్సులో వున్న యువతి త్రోపుడుబండి నెట్టుకుంటూ అచ్చటకు వచ్చినది. ఆమెను చూచి మిసెస్సు బార్టన్ నవ్వింది. ఆమెకు పిల్లలంటే యిష్టం. బండిని అక్కడే ఆపి అటూ యిటూ నెట్టుతున్నది.

'ఈరోజు హాయిగా లేదు?' అని మిసెస్సు బార్టన్ ప్రశ్నించింది.

'ఔను - నిజమేనమ్మా - మాకు కారులేదు. అందువల్ల యీ చిన్నబిడ్డను బండిలో ఎక్కించుకొని వచ్చాను.' అన్నది.

'ఆపిల్లవాడు అందంగా వున్నాడు.' అన్నది బార్టన్.

'ఔను - వాడు ముచ్చటగానే వున్నాడు.' అంటూ మిసెస్సు బార్టన్ పక్కనే కూర్చున్నది. 'కాసేపు బయటకు షికారు తీసికొని వద్దామనుకున్నాను. మేము వున్నచోటు నుంచి యిక్కడకు నడిచిరావచ్చు - దగ్గరగానే వుంటుంది. ఈరోజు హాయిగా వున్నది.' అన్నదామె.

'ఔను - ఈరోజు బాగావున్నది. నేను నిద్దురపోకపూర్వం, యీరోజు షికారు వెళ్ళాలని గతరాత్రి నిర్ణయించుకున్నాను. ఎలా ఊహించుకుంటామో మనకు తెలుసు. ఒక్కొక్కప్పుడు మన ఆలోచనలు విపరీతంగా వుంటాయి. నిద్దురగా వున్నప్పుడు యింకా తమాషాగా వుంటాయి.' అన్నది బార్టన్.

ఆమె తల ఊపింది. ఆ బండిలోని పిల్లవాడు సన్నగా ఏడ్వ ప్రారంభించాడు.

'యిక్కడే - యిక్కడే - ఎందుకు - యీవాళ ఏడ్వ కూడదు - చిన్నపాపా' అంటూ మిసెస్సు బార్టన్ దగ్గరకు వచ్చినది.

తాళంచేతుల గుత్తి గలగల లాడిస్తూ ఆ పిల్లవాని ముందరగా వుంచినది. ఆ తాళంచేతుల రింగుకు అయిదు తాళంచెవు లున్నాయి. అవి చిన్నవిగాను,. తళతళా మెరుస్తూ అనన్యమైన, అభిన్నమైనవిగా వున్నాయి.

---

## ఏకాంకిక

# ట్రెంటన్, కామ్డెన్లకు సుఖప్రయాణం

### రచన: థారన్టన్ విల్డరు

[థారన్టన్ విల్డరు (1878) నవలారచయితగాను నాటకరచయితగాను పూలిట్జరు బహుమానాలను పొందాడు. మాలిసన్, విస్కాన్సిన్లో జన్మించాడు చైనాలో వాని తండ్రి యు. యస్. కన్సల్గా వున్నప్పుడు అచ్చట హైస్కూలులో చేరాడు. తరువాత ఓబర్లిన్, ఏల్, ప్రిన్సుటన్, కాలిఫోర్నియా విశ్వవిద్యాలయములలో విద్య నభ్యసించాడు.

**The Bridge of San Luis Rey** అనే నవల 1927 లో రచించి పేరు ప్రఖ్యాతులు గడించాడు.. ప్రథమ పూలిట్జరు బహుమతిని పొందాడు. 1928 లో **Our Town** అనే నాటకాన్ని రచించి బహుమతిని పొందాడు. 1935 నుంచీ నాటకాల రచనయందే కాలాన్నంతా వినియోగించాడు. 1943 లో **The Skin of Our Teeth** అనే నాటకాన్ని వ్రాసి తిరిగి పూలిట్జరు బహుమతిని పొందాడు.

రచనావిధానంలో విజయాన్ని సాధించినా తానొక ఉపాధ్యాయుడుగానే భావించేవాడు. తరుచు విదేశాలలో ఉపన్యాసాలం యిస్తూవుండేవాడు. యునైటెడ్ స్టేట్సుకు సాహిత్యదూతగా వుండేవాడు.

'A Happy Journey to Trentan and Camden' అనే ఏకాంకిక The long christmas dinner and other plays in one act'అనేఏకాంకిక నాటకాలలో ప్రచురింపబడినది.]

(ఈ నాటకానికి సీనరీ అవుసరంలేదు. స్టేజివెనుకభాగమున యిటుకగోడ వున్నది. అదాతా దుమ్ముతో కూడుకొనివున్నది.

కిర్బి సంసారంలోని అయిదుగురు, సభ్యులు స్టేజి మానేజర్ పాత్రలు వహిస్తారు. స్టేజిమానేజర్ ముందుకు వచ్చి కావలసిన వస్తువులన్నియు సమకూర్చి వెనక్కి వెళ్ళుతాడు. అయితే స్టేజిమానేజరు టైపు జేసిన కాగితంనుండి మైనరు పాత్రలు వహించేవారి పేర్లను చదువుతాడు.

తెర ఎత్తబడ్డది. స్టేజీమానేజరు సిగరెట్టు త్రాగుతూ స్థంభానికి అనుకొని కూర్చుంటాడు.

స్టేజిమధ్యభాగంలో ఆర్థరు గోలీకాయలను అడుకుంటూ వుంటాడు.

కారొలైను ఒక మూలగావుండి కనపడని ఆడపిల్లలతో మాట్లాడుతూ వుంటుంది.

మా కిర్బీ ఊహించుకున్న అద్దంలో చూచుకుంటూ తొందరగా టోపీని పెట్టుకుంటున్నది.)

మా:- మీనాన్నగారు ఎక్కడ? వారు యిక్కడ ఎందుకులేరు ? వారులేనిదే నాటకాన్ని ప్రారంభించం.

ఆర్థరు :- మా, నాటోపీ ఎక్కడవున్నది? నాటోపీ లేకపోయినట్లయితే నేను వెళ్ళనని ఊహించుకుంటున్నాను.

మా:- హాల్లోనికి వెళ్ళి అక్కడ టోపీ వున్నదేమో చూడు. యిప్పుడు కారొలైను ఎచ్చటకు వెళ్ళినది? ఉపద్రవపు పిల్లగా ఉన్నది.

ఆర్థర్ :- బయటకు వెళ్ళి జోన్సు ఆడపిల్లలతో మాట్లాడుతున్నది. హాల్లో వెయ్యిసార్లు చూచాను. టోపీ అక్కడ లేదు. (అదృష్టం ముందు వస్తుందని ఉమ్మివేస్తాడు.) ఇటురా.

మా:- తిరిగివెళ్ళిచూడు. జాగ్రత్తగా చూడు.

(ఆర్థర్ లేచి, కుడివైపుకు పరుగెత్తాడు. తొందరగా చుట్టూ పరికిస్తాడు. తిరిగి ఆటదగ్గరకు వస్తాడు. గోలి కాయను నూటిగా కొట్టుటకు ప్రారంభించాడు.)

ఆర్థర్ :- అక్కడ లేదమ్మా.

మా:- (శాంతముగా) ఆటోపీ లేనిదే న్యూయార్కు వెళ్ళవు. బాగా ఆలోచించు. టోపీ లేనిదే నేను ప్రయాణం చెయ్యను.

ఆర్థర్ :- ఆ, మా. (మా క్రిందకు వచ్చి కిటికీలోంచి ప్రేక్షకులతో మాట్లాడుచున్నది.)

మా;- ఓ, మిసెస్సు సిచ్వార్ట్జ!

స్టేజిమానేజరు;- (స్క్రిప్టును చూస్తూ) యిక్కడే వున్నాను మిసెస్సు కిర్బీ. నీవు యిక వెళుతున్నావా?

మా:- ఒకనిమిషంలో వెళ్ళుతున్నాం. బేబీ ఎలా వున్నది?

స్టేజిమానేజరు :- బాగానే వున్నది. ఆమె వీపుమీద కొట్టాం. ఆమె కక్కింది.

మా :- మంచిపని చేశారు. మిసెస్సు సిచ్‌వార్ట్జ్, ఉదయం, సాయంత్రం ఒక సాసరు పాలు పిల్లికి యిస్తే నేనెంతో కృతజ్ఞతగా వుంటాను. ఓ, గుడ్‌ఈవినింగ్ మిసెస్సు హాబ్‌మియర్!

స్టేజిమానేజరు:- గుడ్‌ఈవినింగ్ మిసెస్సు కిర్బీ-మీరు వెళ్ళుచున్నారని విన్నాను.

మా:- (నమ్రతగా) మిసెస్సు హాబ్‌మియర్. మూడు రోజులు మాత్రమే - కామ్‌డెన్‌లో వున్న నా కూతురు బూలాను చూచుటకు పోతున్నాను. క్రొత్తగా పెళ్ళి అయినది. ఈ సంవత్సరం ప్రారంభంలో యల్మర్‌కు ఒకవారంరోజులు శెలవు దొరికింది. వారు ప్రపంచంలోకల్లా మంచిడ్రైవరు.

(కారొలైను యింటిలోనికివచ్చి తల్లిపక్కనే నిలబడ్డది.)

స్టేజిమానేజరు :- సంసారం అంతా వెళ్ళుతున్నదా?

మా:- యిక్కడ వున్న నల్గురం వెళ్ళుతున్నాం. స్థలం మార్పు పిల్లలకు మంచిదే. నా పెద్దది అయిన కూతురు యిటీవల జబ్బుపడిందట.

స్టేజి మేనేజరు:- ఔను- ఈ సంగతి మాకు చెప్పినట్లు జ్ఞాపకం.

మా:- క్రిందకు వెళ్ళి బిడ్డను చూచివస్తాను. చూస్తేనే గాని నాకు మనఃశాంతిలేదు. (కారొలైనువంక చూస్తూ) మిసెస్సు హాబ్ మియరు దగ్గర శెలవుతీసుకో.

కారొలైను:- (సిగ్గుపడి ముఖం వంచుకొని) గుడ్ ఈవినింగ్ మిసెస్సు హాబ్‌మియర్.

స్టేజి మేనేజరు :- మీకంతా బాగానే వున్నదనుకుంటాను. మీకు యిబ్బందిలేకుండా చూస్తాను.

మా:- మిసెస్సు హాబ్‌మియర్-నాకృతజ్ఞత అందుకో. మిసెస్సు సిచ్‌వార్ట్జు! నే జెప్పిన సంగతి జ్ఞాపకమున్నదా? పిల్లికి పాలుయివ్వటం - ఏదైనా అవుసరమైతే వెనుక తలుపు తాళంచెవి పెట్టెమీద పెట్టాను.

ఆర్థర్, కారొలైను:- అమ్మా, అంతా వింటాము.

మా:- నాగుడ్డలు వదలండి. తాళంచెవి వుండిన సంగతి చెబుతున్నాను.

స్టేజి మేనేజరు :- హాయిగా ప్రయాణం చేసిరండి. లూపీకి నా ముద్దులు తెల్పండి.

మా:- తప్పకుండా చెబుతాను. (ఆమె గదిలోనికివచ్చినది.) అక్కడ ఏంచేస్తున్నావు పా?

ఆర్థర్:- మా-నా టోపీ కన్పించలేదు.

(యల్మర్ టోపీ తీసుకొనివస్తాడు.)

యల్మర్ :- ఇదిగో ఆర్థర్సు టోపీ - ఆదివారంనాడు కారులో వదిలివేశారు.

మా:- మంచిది - యిప్పుడు మనం బయలు దేరవచ్చు కారొలైను - నీ ముఖానికి ఏమి పూసుకున్నావు ?

కారొలైన్ :- ఏమీ లేదు.

మా:- నీవు ఏదైనా రాసుకుంటే, చెంపకాయి కొడతాను.

కారొలైన్ :- లేదు, అమ్మా - నేను ఏమీ వ్రాయ లేదే! (తలవంచుకొని) ఎట్లాగా వుండాలని అద్దుకున్నాను. ఎక్కడికైనా వెళ్ళేటప్పుడు మా హైస్కూలులోని ఆడపిల్ల లంతా అట్లాగే జేస్తారు.

మా:-ఆ సంగతి నేను ఎక్కడా చూడలేదు. యల్మర్! ఏం జేస్తున్నావు ?

యల్మర్ :- (ఎప్పుడూ ఆదుర్దాగా కళ్ళఅద్దాలనుండి చూస్తూ వుంటాడు.) గ్యారేజికి వెళ్ళి ఆఖరిసారిగా చూచి వచ్చాను.

మా:- సంతోషం. యిప్పుడు మనం బయలు దేర వచ్చును. ఆర్థర్ గోలీలు అవతలపెట్టు. ఎవ్వరైనా చూస్తే, నీవు ప్రయాణానికి సిద్ధంగా వున్నట్లు చెప్పను.

(వారంతా హాల్లోగుండా క్రిందకు దిగి వీధిలోనికి వచ్చారు.)

యల్మర్ :- అబ్బాయిలూ, కారుకు దగ్గరగావుండకండి.

మా:-ఆ పిల్లలు ఎప్పుడూ తుంటరి పనులే చేస్తారు. (స్టేజి మానేజరు నాలుగు కుర్చీలు ముందుకు పెట్టి ఒక చిన్న ప్లాటుఫారం ఏర్పాటు జేశారు. యిది కారు.

స్టేజికి మధ్యలో వున్నది. సభికులకు ఎదురుగా వున్నది. యల్మర్ ఊహించుకుంటున్న స్టీరింగుమీద చేతులు పెట్టాడు. వాని పక్కగా కారొలైను కూర్చున్నది. వెనుక ఆర్థరు కూర్చున్నాడు. కారొలైను వెనుకగా కూర్చున్నది.)

కారొలైను:- గుడ్ బై, మిల్డ్రెడ్. గుడ్ బై హెలన్.

స్టేజిమానేజరు :-గుడ్ బై కారొలైన్, గుడ్ బై మిసెస్సు కిర్బీ-మంచి టైములో బయలు దేరుతున్నారు.

మ:- గుడ్ బై-అమ్మాయిలూ.

స్టేజి మానేజరు:- గుడ్ బై, కేటు-కారు అందంగా వున్నది.

మా:- (కిటికీలోనుంచి చూస్తూ) గుడ్ బై యమ్మా, ప్రపంచంలోకల్లా మంచి చెవరలెట్ చిన్నకారు-గుడ్ బై-యాడ్లర్.

స్టేజి మానేజరు:- ఏమిటి, నీవుకూడా వెళ్ళుతున్నావా మిసెస్సు కిర్బీ?

మా:- మూడు రోజులు మాత్రమే, మిసెస్సు యాల్డర్. మా పెండ్లి అయిన అమ్మాయిని చూచుటకు వెళ్ళుతున్నాం.

స్టేజి మానేజరు :- సుఖంగా వెళ్ళండి.

(ఇప్పుడు మ, కారొలైను, స్టేజిమానేజరు ఒకరి కొకరికి గుడ్ బైలు, నమస్కారాలు చెప్పుకున్నారు. వీధిఅంతా గుడ్ బైలు చెబుతున్నది. ఆర్థరు చేతిరుమాలు ఊపుతున్నాడు. కారు రెండుమూడు సార్లు ఒరిగి వెళ్ళినది.

ఆర్థరు:- (హఠాత్తుగా భయపడి) పా! పా! స్కూలు వక్కగా వెళ్ళవద్దు. మిష్టరు బిడెన్‌బాచ్ చూస్తాడు.

మా:- వాడు చూచినా లెక్కచేయ నవసరంలేదు. నా పిల్లలను నేను స్కూలునుంచి ఒకరోజు తీసికొని పోవుటకు భయం దేనికి?

(దారిలో పోతున్న ఒక వ్యక్తిని చూచి యల్మార్ తల ఊపుతాడు.)

మా:-ఎవ్వరు? యల్మార్ !

యల్మార్ :- వాడే మనకు దారిపొడుగునా విందులు ఏర్పాటు చేసేది.

మా:- అతడేనా మనకు ఆహారపదార్థాలు కొనేది? వాడ్ని పోనీ.

యల్మార్:- మంచి గాలి వీస్తున్నది. పిల్లలారా బాగా పీల్చండి. (ధ్వనిచేస్తూ పిల్లలు గాలి పీలుస్తున్నారు.)

ఆర్థరు:- యివన్నీ పొలాలుగా వున్నాయి. వెబర్ హెల్బ్రోనరు సూట్లు బాగావుంటాయి. మా, నే కుట్టించుకో వద్దా ?

మా:- నీవు మంచి మార్కులతో గ్రాడ్యుయేటు అయితే మీ నాన్న కుట్టిస్తారు.

కారొలైను:- ఓ, పా! మనం ఆ పీనుగ వెళ్ళిందాకా వుండాలా ?

(పా టోపీ తీస్తాడు, మా ఆదుర్దాగా ముందుకు వస్తుంది.)

మా:-ఆర్థర్, టోపీ తీసివేయి. మీ నాన్న వంకచూడు. యల్మర్ - అవి మీ తమ్ముని లాడ్జి అనుకుంటాను. దాని మీద బోర్డుచూడు. అది యలిజబెత్ బ్రాంచి అనుకుంటాను.

(యల్మర్ తల ఊపుతాడు. మా, నిట్టూర్పు విడుస్తుంది. చిక్-చిక్-చిక్-వాళ్ళంతా ముందుకువంగి నిశ్శబ్దంగా మరణోత్సవాన్ని చూస్తారు. ఒకక్షణకాలం అయినతరు వాత మా, చెబుతున్నది.)

మా:-మనం హెరాల్డును గురించి మరచి పోలేదనుకుం టాను. దేశంకోసం అతడు జీవితాన్ని ధారపోశాడు. అది మనం మరవకూడదు. (ఆమె ఒకవ్రేలితో కన్ను కొలికి తుడుచుకుం టుంది) ఒకరోజు కొన్ని నిమిషాలబాటు మనం ట్రాఫిక్‌ను నిలుపుదల చేస్తాం అనుకుంటాను.

పిల్లలు:- (అసౌఖ్యంగా) మా!

మా:- నేను సిద్ధంగానే వున్నాను. ఈ కారులోవున్న వాళ్ళంతా సిద్ధంగానే వున్నారనుకుంటాను. (ఆమె చేతిని పా బుజంమీద వేస్తుంది) యల్మర్ - మనం ముందుగా వెళ్ళాలి. (ఆమెచేతిని పా తాకుతాడు.)

పిల్లలు:- మా, అందరూ నీవంకచూస్తున్నారు. అందరు నిన్నుచూచి నవ్వుతున్నారు.

మా:- నోరు ముయ్యండి! యలిజబెత్తు న్యూజెరెన్‌లో వున్న కొంటె వెధవలు నవ్వితే నాకేం - బయలుదేరండి. (కారు మరల సాగింది.)

కారొలైను:- పా, వాడు 'రైటు'ను ఆవిధంగా ఉచ్ఛరిస్తా రెందుకు ?

యల్మర్:- అదివిని అడుగుతారని.

కారొలైను:- పాప, నీవు నన్ను బాధ పెట్టుతున్నావు-మా - వాళ్లు 'Three Hundred Rooms Three Hnndred Baths?' అంటూ రెందుకు?

ఆర్థరు :- స్పాగెట్టీ స్వీటు బాగావుంటుంది. అమ్మా, నీవు ఎప్పుడైనా తిన్నావా?

మా:- నీకు తెలియదురా.

ఆర్థర్ :- యిప్పుడు నాకు కావాలి.

కారొలైను :- అమ్మా, యింటికి వెళ్ళినతరువాత కొన్ని తయారుచేసి పెట్టు.

మా:- మీరిచ్చే సలహాలన్నీ విచారిస్తాను.

(ఇదంతా వినోదంగా వున్నది. పిల్లలంతా గోడవగా నవ్వుతారు. యల్మరుకూడా నవ్వుతాడు. మా, మామూలుగా వుంటుంది.)

యల్మర్ :- ఎవ్వరూ నీమీద ఫిర్యాదుచేయుటలేదు. కీటు - నీవు బాగా వంటచేయగలవని అందరికి తెలుసు.

మా:- నేను బాగా వంటచేయగలనో లేదో నాకు తెలియదు. నాకు అనుభవం వున్నదనిమాత్రం తెలుసు. 25 సంవత్సరాలు, రోజుకు మూడు పర్యాయాలు వంట చేశాను.

ఆర్థర్ :- మా, ఒకసారి నీవు తినుటకు బయటకు వెళ్ళావు.

మా:- ఔను. అది లీపుసంవత్సరంలో.

(ఈ తమాషాకూడా బాగావున్నది. నవ్వుకున్నారు. కారొలైను కుషన్ సోఫాలో దొర్లుతున్నది.)

కారొలైను:- మా, మనవూళ్ళో యీవిధంగా వుండటం నాకు యిష్టం.

మా :- మంచి సముద్రపు గాలివస్తున్నది. హాయిగా పీల్చండి. యల్మర్. బ్రిడ్జిమీద జాగ్రత్తగా కారునడుపు-మనం బ్రన్సువిక్కు దగ్గరకు వస్తున్నాం.

ఆర్థర్:- మా, ఈ సారివచ్చే మంచిస్టేషన్ ఏది?

మా:- (నెమ్మదిగా) నీకు వద్దు అంటివిగదా.

కారొలైను:- (కీచుగా) ఔను-మా-వాడు అన్నాడు. వాడు స్కూల్లోకూడా ఆ విధంగానే మాట్లాడుతాడు. వాడు మితిమీరి నట్లుగా వుంటాడు.

మా:- అనవసర విషయాన్నిగూర్చి కలతపడకండి. ఈ కారులోవున్న వాళ్ళంతా - నాకు తెలిసినంతవరకు మనుష్యులే అనుకుంటాను.

ఆర్థరు:- నీవు బుద్ధిమంతుడుగా వుండు. యల్మరు - ఆ కుక్కనుచూచి జాగ్రత్తగా కారునడుపు - అది అందంగా వున్నది. ఆహారం కోసం వేచివున్నట్లుగా వున్నది. చెప్పరు పీల్డు సిగరెట్లనుగూర్చి మంచి ప్రకటజేశారు.

ఆర్ధర్ :- మా ?

మా :- ఏమిటి ?

ఆర్ధర్ :- న్యూయార్క్ డెయిలీ పోస్టుపేవరును క త్తి రించాలి అమ్మా.

మా:-ఆపని చేయకూడదు. ఆ పత్రికవలన పిల్లలంతా ఉదయం 4½ గంటలకే నిద్దురలేస్తారు. ఒక మిలియను డాలర్లు యిచ్చినా నా కుమారులలో ఒక్కడుకూడా 4½ గంటలకు నిద్దుర లేవరు.

ఆర్ధరు :- హ, మా.

మా:- నా కుమారులలో ఎవ్వరుకూడా 4½ గంటలకు నిద్దుర లేవరు. ఆ నిద్రాదేవుడ్ని మరవలేరు.

ఆర్ధరు :- అమ్మ ఎప్పుడూ దేవుడ్నిగూర్చి మాట్లాడు తుంది. బహుశ ఈరోజు ఉదయం ఆమెకు దేవునిదగ్గరనుంచి ఉత్తరం వచ్చిందనుకుంటాను. (మా కోపంతో లేస్తుంది.)

మా:- యల్మరు-ఒక క్షణకాలం కారు ఆపు. ఆవిధంగా మాట్లాడేవాళ్ళతో ఒక అడుగుకూడా ముందుకు వెళ్ళను. ఆర్ధరు! యీ కారులోనుంచి దిగివెళ్ళు - యల్మరు డాలరు బిల్లు ఒకటి యివ్వు - వాడు న్యూయార్కు తిరిగిపోతాడు - వాడు యిక్కడ వుండొద్దు.

ఆర్ధరు :- నేనేం అన్నాను అమ్మా ? దాన్ని గురించి నీకెందుకు కోపం.

యల్మరు :- అబ్బాయి అన్నది నేను వినలేదు, కేటు.

మా:- దేవుడు నాకు అనేకంగా సహాయపడ్డాడు. దేవుడ్ని గురించి పిచ్చిగా మాట్లాడుతే సహించను. వెళ్ళు - నాదగ్గరనుంచి వెళ్ళు.

కారొలైను :- అమ్మా, ప్రయాణాన్ని పాడుచెయ్యకు.

మా:- లేదు.

యల్మరు :- మనం వెళ్ళుతున్నాం కేట్. వానితో ఈరాత్రి మాట్లాడుతాను.

మా:-సరే, యల్మర్, నీవు చెప్పినట్లుగానే వింటాను. అయితే వాడిపక్కగా కూర్చోను. కారొలైను, నీవు వచ్చి నాదగ్గర కూర్చో.

ఆర్థరు:- (భయంగా) ఏమిటమ్మా?

మా:- దాన్ని గురించి నేను మాట్లాడదల్చుకోలేదు. మీ నాన్నగారు సబ్బుతో నీ నోరు కడుగుతారనుకుంటాను. దేవునిగూర్చి యీ విధంగా మాటలాడితే మనం ఎక్కడ వుంటాం? సరే, పోనీ యల్మర్.

కారొలైను:- ఏం అన్నాడు అమ్మా? వాడు చెప్పినది నేను వినలేదు.

మా:- దాన్ని గూర్చి నేను మాటలాడదల్చుకోలేదు.

(అంతా నిశ్శబ్దంగా ఒకనిమిషం ప్రయాణం సాగించారు.)

యల్మర్:- కారు ఆపి నీకు పోస్తాను.

మా:- సరే, నీకు తెలుసుగా.

మల్లారు:- రేడియేటరులో నీరు వున్నదో లేనో చూడాలి.

స్టేజిమానేజరు:- (స్క్రూపు అవతలపెట్టి గంభీరంగా వస్తాడు. కారుటైరులకు గాలిగొట్టుతాడు.) ఆయిల్-పెట్రోలు కావాలా ?

మల్లారు:- అవసరంలేదు. న్యూయార్కులోనే పని పూర్తిచేశాను.

మా:- మనం కాండేన్ రోడ్డుమీద వున్నామా?

స్టేజిమానేజరు:- తిన్నగా వెళ్ళండి. కొద్ది నిమిషాలలో ట్రెంటన్‌కు జేరుకుంటారు.

(జాగ్రత్తగా కారులో నీరుపోస్తాడు. కాండెన్ చాలా పెద్దపట్టణం.)

మా:-నా కూతురు-పెండ్లి అయిన కూతురు ఆ పట్టణం అంటే ఎంతో యిష్టంగా వుంటుంది.

స్టేజిమానేజరు:- అది పెద్దపట్టణం. దాని దగ్గరలో నే పుట్టాను.

మా:- మంచిది - మీరంతా యింకను అక్కడే వుంటారా ?

స్టేజిమానేజరు:- లేదు. మా తాత అచ్చట అంతా అమ్మివేశాడు. దానిమీద యిప్పుడు ఒక ఫ్యాక్టరీ కట్టారు. అందువల్ల ఫిలడల్‌ఫియాకు వెళ్ళారు.

మా:- నా కూతురు బూలా అక్కడే వుంటున్నది. ఆమె భర్తకు టెలిఫోనుకంపెనీలో ఉద్యోగం. మనం అంతా కొన్నిరోజులు పాటు ఆమెను చూచుటకు వెళ్ళుతున్నాం.

స్టేజిమానేజరు:- ఔను.

మా:- ఈ మధ్య సుస్తీచేసినది. అందువల్ల చూచివద్దామని వెళ్ళుతున్నాను. నాభర్త, పిల్లవాడు, వై. యం. సి. ఎ. లో వుంటారు. మేడపైన పరిశుభ్రమైన, అందమైన పడకటిల్లు వున్నదని విన్నాను. నీవు ఎప్పుడైనా అక్కడ వున్నావా ?

స్టేజి మానేజరు:- లేదు. నేనే కొలంబసును.

మా:- అట్లాగా.

స్టేజి మేనేజరు:- నేను బాస్కటుబంతి ఆట ఆడేవాణ్ణి. అదంటే నాకెంతో అభిలాష. (మా కుర్చీలో కాలుపెట్టి నిల్చున్నాడు. ఒకరినొకరు వింతగా చూస్తున్నారు. తెలియనట్లుగా నటిస్తూ, కారును పరీక్షిస్తున్నట్లుగా నటించేవాడు.) మీరంతా హాయిగా ప్రయాణం చేస్తున్నారనుకుంటాను.

అందరు :- కృతజ్ఞత. నీకు మంచి అదృష్టం కల్గుగాక.

మా:-ఈ ప్రపంచంలో అనేకమంది అందమైన మంచి వాళ్ళున్నారు.

కారొలైను :- మా, నిన్ను గురించి అన్నిసంగతులు వానికి చెప్పకూడదు.

మా:- కారొలైను, నీవని నీవు చూచుకో-నా పనిలో జోక్యం చేసికొనకు. వాడు నేనంటే ప్రేమగా వున్నాడు. వాని

తల్లి ఫిలడల్ఫియాలో వున్నది. ఆ భయంకరమైన గ్రీకు స్థలంలో తింటాడనుకుంటాను. కొన్ని రోజులుపాటు నేనే వానికి భోజన సదుపాయం ఏర్పాటు జేస్తాను.

కారొలైను :- నాకు ఆకలిగా వున్నది.

యల్మరు :- మనం అంతా విందు ఆరగిద్దాం.

మా:- అట్లాగే.

యల్మరు:-ఇదిగో ఈ అర్ధడాలరు తీసుకొని తొందరగా కొని తీసికొనిరా.

(ఆర్థరు కారు దిగి వెళ్ళాడు. మా, కారొలైను కారుదిగి కొన్ని అడుగులు నడిచారు.)

మా:- ఆ పువ్వు ఏమిటి? ఆ పూలను బులాకు తీసి కొని పోతాను.

కారులైను :- పూలుకాదమ్మా, కలుపు మొక్కలు.

మా:-అవి నాకిష్టం. నేను జర్సీలోపుట్టినందుకు సంతోషంగా వున్నది. ఆచోటు ఎంతో హాయిగా వుంటుంది.

(అందరూ కాసేపు షికారుచేశారు. ఆర్థరు తిరిగివచ్చి తెచ్చిన పదార్థాలను అందరికి పంచి పెట్టుతున్నాడు. టీవల జరిగిన పరువుదీసే సంఘటనకు విచారపడు తున్నాడు. చివరకు వాళ్ళ దగ్గరకువెళ్ళి నమ్రతగా చెప్పాడు.)

ఆర్థరు:- అమ్మా, నేనుచెప్పిన దానికి విచారపడు తున్నాను. క్షమించు.

(బావురుమని ఏడ్చాడు.)

మా:-అక్కడ, అక్కడ, ఒకొక్కప్పుడు మనమంతా ఈర్ష్యగా మాట్లాడుతాం. నీ అర్థం తెలిసికున్నాను. ఆర్థరు యింకా పెద్దగా ఏడుపు ప్రారంభించాడు. ఎందుకు? యిప్పుడు, యిప్పుడు – నీవు మంచి పిల్లవాడివిరా. నీసంగతి నాకు తెలుసు. నీ హృదయం పవిత్రమైనది. ఆసంగతి మా అందరికీ తెలుసు. (బుజ్జగించినది. కారొలైనుకూడా విలపించటం ప్రారంభించినది. మాకు హఠాత్తుగా సంతోషం వచ్చినది.) యిదంతా తమాషాగావున్నది. ఏడ్చుటకు మంచిరోజుగా వున్నది. లోపలకురాండి. కారొలైన్! నీవు తండ్రిదగ్గర కూర్చో. వాడు నా దగ్గర కూర్చుంటాడు. యిట్టిపిల్లలను నేను యింతవరకు చూడలేదు. తెచ్చిన పదార్థం తినండి. యల్మరు – బయలు దేరు. కారొలైను! ఏం జేస్తున్నావు?

కారొలైను:- ఉమ్మి వేస్తున్నాను.

మా:-అందరూ క్షమించమంటున్నారు.

కారొలైను:- క్షమించు అమ్మా.

మా:- ఈ వూరేమిటి? ఆర్థరు, నీవు పోస్టాఫీసు చూచావా?

ఆర్థరు :- లారెన్సు లిల్లీ.

మా:-ఆ పెద్దయిల్లు ఏమిటి? పచ్చగావున్నది. క్రెన్ టన్ వూరు వచ్చినది.

కారొ లైను:- పాపా, యిక్కడనే జార్జి వాషింగ్‌టన్, డెలావార్‌ను దాటాడుట-ట్రెన్‌టన్ దగ్గరనే అమ్మా. అతడు యుద్ధంలో మొదటివాడుగా వున్నాడు. శాంతిలో ప్రథముడుగా వున్నాడు. దేశప్రజల హృదయంలో ప్రథముడుగా వున్నాడు.

మా:-(చుట్టూవున్న ప్రపంచాన్ని అవలోకిస్తూ) జార్జి వాషింగ్‌టన్ ఎప్పుడూ అనృతం చెప్పలేదు. అదే వానిలోని గొప్పతనం. అందుకనే వానిని మెచ్చుకుంటాను. (అంతా నిశ్శబ్దంగా వున్నది. పిల్లలంతా మౌనంగావున్నారు.)

ఆర్థరు:- అమ్మా, నీవు ఎప్పుడైనా ఓహియో వెళ్ళావా?

మా:- లేదు.

(అందరూ నిద్దురమత్తులాంటి నిశ్శబ్దత వహించారు. కారొలైనుతండ్రికి దగ్గరగా కూర్చున్నది. మా, ఆర్థరు మెడను కౌగలించుకున్నది.)

ఆర్థర్ :- అమ్మా, యీ ప్రపంచంలో ఎంతోమంది విచిత్రమైన మనుష్యులున్నారు. యునైటెడ్‌స్టేట్సులో వేలకు వేలు వున్నారు. అక్కడ ఎంతమంది వున్నారమ్మా?

మా:- నాకు తెలియదు. నాన్నగారిని అడుగు.

ఆర్థరు :- పా, ఎంతమంది వున్నారు?

యల్మర్ :- 126 మిలియన్ల మంది వున్నారు.

మా:- (ఆర్థరును గట్టిగా నొక్కుతూ) వాళ్ళంతా సాయంత్రం పిల్లలతో కారులో షికారు వెళ్ళుతారు.

ఎవ్వరైనా పాటపాడండి? ఆర్థరు! నీవు ఎప్పుడూ పాడుతూ వుండేవాడివి. మౌనంగా వున్నా వేమిటి?

ఆర్థర్:- అలాగే పాడుతాను. (పాట ప్రారంభించాడు.)

(కారొలైను, పా, మా అందరూ కలిసి పాడుతున్నారు. మా, హఠాత్తుగా అరిచింది.)

మా:-యల్మర్, ఆబోర్డుమీద కాంటెన్ అని వున్నది.

యల్మర్:- ఔను కీటు - కారు కదులుతూ ఒరగ బడుతూ పోతున్నది.

మా:- అదిగో కాంటెన్ - బులాదగ్గరకు వెళ్ళుదాం. అంతా తిన్నగా వుండండి. బూలాకు యీమధ్య ఆపరేషన్ చేశారు. సుస్తీపడ్డది. మనమంతా గోల చేయకుండా వుండాలి. నన్ను కారొలైను తలుపుదగ్గర వదలండి. మీ మొగాళ్ళంతా, వై. యమ్. సి. ఏ. కు వెళ్ళి ఒక గంటలో డిన్నరుకు తిరిగి రాండి.

కారొలైను :- (కళ్ళు మూసుకుని ముక్కుమీద చేతులు పెట్టుకుని) నేను మొదటి నక్షత్రంచూచాను. అందరూ చూడాలనుకుంటారు. (నక్షత్రాల పాటపాడింది. తల్లి కూతురు చేతులు కలుపుకున్నారు.)

కారొలైను :- షేక్సుస్పియరు. మా, నీవు 'లాంగ్ ఫెలో' అంటారు.

మా:- లాంగ్ ఫెలో!

కారొలైను :- యిప్పుడొక రహస్యం. నే నెవ్వరికి చెప్పను. అమ్మా, నీవు కోరుకో.

మా:-సత్యంత్రం లేకుండా నే కోరుకోగలను. నాకోర్కెలు నేను పెద్దగా చెప్పగలను. నీకు వినాలని వున్నదా?

కారొలైను:- లేదు మా, మాకు యిదివరకే తెలుసు. మేము విన్నాం. (ఆమె ఎడం బుజంమీద కారొలైను తలపెట్టు తోంది.) నన్ను మంచిపిల్లగా వుండమంటావు. ఆర్థర్‌ను నిజాయితీగల వాడుగా వుండమంటావు.

మా:- నీ సంగతి నీవు చూచుకో.

యల్మరు:- కారొలైను, బూలా వ్రాసిన ఉత్తరం నా కోటుజేబులో వున్నది. దాన్ని చూసి నేను ఎర్రగుర్తులు పెట్టిన విషయాలను పెద్దగా చదువు.

కారొలైను:- రెండు పెద్ద ఆయిల్ టాంకులు తరువాత కొన్ని బ్లాకులు దాటాలి...

అందరూ :- అక్కడే వున్నవి.

కారొలైను:- ఏ. పి. గుర్తుగల మూలకు వస్తారు. ఎడమ పక్కన స్టోరు వుంటుంది. దానికి మూలగా చిన్న యిల్లు వుంటుంది.

(అందరూ గుర్తులను గమనించారు. కుడి పక్కకు తిరిగి రెండు బ్లాకులు గడచిన తరువాత, వేయుకుహోసరు స్ట్రీటు, నెంబరు 471 మా యిల్లు.)

మా:- ఆ వీధి చాలా బాగావున్నది.

కారొలైను:- అమ్మా, మనవీధికన్న బాగుంది. అందంగాను వున్నది. బూలా మనకంటే భాగ్యవంతురాలు కాదా?

మా:-(గట్టిగాచూస్తూ) నీసంగతి నీవు చూచుకో. నేను వున్నప్పుడు భాగ్యం, భాగ్యం లేకపోవటం అనేమాటలు వినను. మనుష్యులు మర్యాదగా లేకపోతే, వారికి ఎంతభాగ్యం వున్నా నేను ఖాతరు చెయ్యను. నేను ప్రపంచంలోకల్లా మంచి వీధిలోనే వుంటున్నాను. ఎందువలన అంటే, నా భర్త, నా పిల్లలు అంతా అక్కడ వుంటున్నారు.

(ఒకక్షణకాలం కారొలైను వంకచూచి పైకి చూసింది. బూలా మెట్లమీద-వేచివున్నది. మాచేతిని ఊపింది. బూలాకూడా చేతులు ఊపుతున్నది.

'హలో, బూలా, హలో బూలా' అంతా అన్నారు. అందరు కారులోనుంచి దిగుతున్నారు. బూలా తండ్రిని ఆప్యాయంగా గౌరవించింది.)

బూలా:- హలో పాప, మీరు అలసినట్లుగా వున్నారు. హలో అమ్మా - అర్ధర్, కారొలైను - అందరిని ఆహ్వానించినది.

మా:-గుడ్డలన్నీ దుమ్ము కొట్టుకున్నాయి. మీ నాన్న గారికి విశ్రాంతి అవుసరం. వారికి ఇప్పుడు శెలవు దొరికినది. వారికి బాగా విందు చెయ్యాలి. మీ నాన్న నీకొక బహుమతి తెస్తారు.

బూలా :- యిప్పుడెందుకు నాన్నా ? నాకోసం కష్ట పడతావు - అలసటగా వున్నావు.

మా:- అది ఒకరహస్యం. డిన్నరుదగ్గర ఆ బహుమతి చూడు.

యల్మర్:-తాలీ, హోర్సు ఎక్కడ ?

బూలా:- వారు ఆఫీసుల్లో వున్నారు. ఒక నిమిషం లోనే వస్తారు. మిమ్ములను చూచుటకు ఆదుర్దాగా వున్నారు.

మా -పురుషులంతా, వై. యమ్. సి. ఏ. కు వెళ్ళి ఒకగంటలో తిరిగి రాండి.

బూలా- (తండ్రి పక్కగా నిలబడి) నేనుగా వెళ్ళండి. మీకు కనపడుతుంది. నాకోసం మీరు వెళ్ళుతున్నారు నాన్నా!

యల్మర్:- లేదమ్మా - యీ ప్రపంచంలో ఒక లూవీ మాత్రమే వున్నది.

బూలా:- (కళ్ళలలో నీళ్ళు తిరిగాయి) నాన్నా, నేను ఇంకా బ్రతికేవున్నాను. (తండ్రిని అప్రయత్నంగా ముద్దు పెట్టుకొని మెట్లదగ్గరకు వెళ్ళుతుంది. యల్మరు, ఆర్థరు సహాయంతో స్టేజిమానేజరు కారును తీసివేస్తాడు.)

అమ్మా, మేడపైకి రండి. గుడ్డలన్నీ విప్పండి. కారొలైను దొడ్లో నీకొక విచిత్రమైన వస్తువు వున్నది.

కారొలైను:- కుందేళ్ళా ?

బూలా :- లేదు.

కారొలైను - కోడిపెట్టలా ?

బూలా:- లేదు. వెళ్ళిచూడు.

(కారొలైను స్టేజీమీదనుంచి పరుగెత్తును. బూలా, మా, మేడమీదకు వెళ్ళుతారు. రెండు కొత్త కుక్కపిల్ల లున్నాయి. న్యూయార్కుకు ఒకదానిని తీసికొని వెళ్ళుటకు ఆలోచిస్తున్నారు.)

మా:-మీ యిల్లు బాగావుంది బూలా!

బూలా:- నేను ఆసుపత్రినుంచి తిరిగి వచ్చేటప్పటికి మీ అల్లుడు అన్ని వస్తువులు నీటుగా సర్ది వేశారు. యిప్పుడు నాకేం పనివున్నది?

మా- అందంగా వున్నది.

(స్త్రీ మా నేజరు ఎడమపక్కనుంచి ఒక పరుపుచుట్టను నెట్టుతాడు. బూలా దానిమీద కూర్చుని పరీక్ష చేయుచున్నది.)

బూలా:- అమ్మా యీ పక్క మీకు సౌఖ్యంగా వుంటుంది.

మా:- పడుకొనుటకు నాకు యిబ్బందిలేదు.(కూతురు పక్కగా కూర్చున్నది) నేను క్రిందటిసారి చూచినప్పుడు, నే నెవ్వరినో తెలుసుకోలేని స్థితిలో వున్నావు. 'అమ్మ ఎప్పుడు వస్తుంది. అమ్మ ఎప్పుడు వస్తుంది.' అని కలవరించావు. అయితే డాక్టరు నన్ను పంపించివేశారు తెలుసా?

బూలా :- (తల్లి బుజంమీద తలపెట్టి దుఃఖిస్తుంది) అతి భంకరమైనది. దారుణమైనది. కొన్ని నిమిషాలు కూడా భరించలేకపోయినాను.

మా:- దేవుడు మనకు చాలా మేలుచేశాడు. దేవుడు చల్లగా చూచాడు. ఎందుకో మనకు తెలియదు. మనం మన పనులను చేస్తూనే వుంటాం.

బూలా :- కోడిపెట్ట వున్నదమ్మా, పొయ్యిలో వుంచాను.

మ:- ఎప్పుడు పెట్టావమ్మా ?

బూలా:- ఇప్పుడేవెళ్ళకు. నేను నీతో మాటాడుతూ కూర్చోవాలి.

మా:- (నవ్వుతూ) తెలివితక్కువ పిల్లవు - నేను మామూలు అమ్మనే! (ఆమె చేతుల వెనుకభాగమును చూచి పదీ.

బూలా :- (కోపంగా) అమ్మా, నీవు మంచిదానివే. మేమంతా ఎప్పుడూ అలాగే చెబుతున్నాం. అందులో ముఖ్యంగా మాకు మంచి అమ్మవు.

మా:. (అసౌఖ్యంగా) నేనంటే నీకు యిష్టమనుకుంటాను. కోడిపెట్ట తెగినదేమో చూచుటకు క్రిందకు వెళ్ళుతున్నాను. ఒక నిమిషం కళ్ళుమూసుకొని పడుకో. భోజనానికి అన్ని వస్తువులు వున్నవి కదూ-షాపులు మూసివేస్తారు.

బూలా:- అన్నీవున్నవి-గుడ్లు-మాంసం.

(యిద్దరూ నవ్వుకుంటారు.)

మా :- గుడ్లలలోను, మాంసంలోను పురుషులు ఏం చూస్తారో నాకు తెలియకుండా వున్నది. అతి దారుణంగా వుంటాయి. కోడిపెట్ట పొయ్యిలో వుంచి ఎంత కాలమైనది?

బూలా :- అయిదు గంటలకు.

మా:- పదినిమిషాలు పాటు కళ్ళుమూసుకో. (బూలా కళ్ళుమూసుకొని పడుకుంటుంది. మా, పరధ్యానంగా పాట పాడుకుంటూ క్రిందకు దిగివస్తుంది.)

తెర పడుతుంది.

--- ••• ---